శ్రీ రస్తు
ఆళ్వారెమ్బెరుమానార్ జీయర్ తిరువడిగళే శరణమ్.
శ్రీమతే రామానుజాయ నమః.
శ్రీమద్వరవరమునయే నమః.

    

శ్రీమత్కాంచీ ప్రతివాదిభయంకరమ్ అణ్ణంగరాచార్యస్వాములు
కృపచేసిన టీకతోకూడిన

# తిరువాయ్ మొళి — నాల్గవశతకము



## ప్రథమదశకము — ఒరునాయకమ్

అవతారిక:— క్రిందటి శతకమున చరమదశకములో ఆళ్వారు అప్రమేయ బ్రహ్మానందము పొందినారుగదా! ఇట్టి బ్రహ్మానందమును సంసారులుకూడ పొందగలరని ఆశించి వారినిచూడగా, వారు ఐశ్వర్యకైవల్యాదిక్షుద్రపురుషార్థలోలురై యుండినందువలన అటువంటి ప్రయోజనాంతరములలో వైముఖ్యముకలిగి భగవదనుభవములో ఆభిముఖ్యము కలుగచేయదలచి ఐశ్వర్యాది క్షుద్రపురుషార్థముల దోషభూయిష్ఠత్వమును, భగవద్విషయగుణభూయిష్ఠత్వమును సంసారులకు ఉపదేశించుచున్నారు * ఒరునాయకమాయ్ ఇత్యాదియైన ఈదశకములో. భగవద్గీత సప్తమాధ్యాయములో "చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోఽర్జున । ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ!" అను శ్లోకము సుప్రసిద్ధము. ఇందు, ఆర్తః -

భ్రష్టైశ్వర్యకాముడు; అర్థార్థీ - అపూర్వైశ్వర్యకాముడు; జిజ్ఞాసుః - ఆత్మాను భవమును కోరువాడయిన కేవల్యార్థి. ఈముగ్గురు ప్రయోజనాంతరపరులు. జ్ఞాని ఒకరే పారమార్థికులు. ఈశ్లోకవివరణరూపమే ఈదశకము. ... *

* ఒరునాయకమాయ్ ఓడవులకుడనాణ్డవర్ *
కరునాయ్ కవర్న్దకాలర్ శిదైకియపానైయర్ *
పెరునాడుకాణ ఇమ్మైయిలేపిచ్చైతామ్ కొళ్వార్ *
తిరునారణన్ తాళ్ కాలమ్బెఱచ్చిన్దిత్తుయ్ మినో. ౧

మూలపదములు :— ఒరునాయకమాయ్ ఓడ ఉలకు ఉడన్ ఆణ్డవర్ కరు నాయ్ కవర్న్ద కాలర్ శిదై కియ పానైయర్ పెరునాడు కాణ ఇమ్మైయిలే పిచ్చై తామ్ కొళ్వార్ తిరునారణన్ తాళ్ కాలమ్బెఱ శిన్దిత్తు ఉయ్ మిన్.

అర్థము:—ఏకాధిపత్యము గలవారై చిర కాలము లోకములనన్నింటిని బరిపాలించిన మహా రాజులు నల్లకుక్కచేఁ గఱవఁబడిన కాళ్లుగల వారై పగిలిన కుండలుగలవారై పెద్దలోకమం తయు చూచున ట్లీలోకమందే భిక్షను తామే యెత్తుదురు (గాన) సంపద్యుక్తుండై నిరుపాధిక స్వామియైన శ్రీమన్నారాయణునియొక్క శ్రీపాద ములను గాలవిళంబములేక ధ్యానముఁజేసి యుజ్జీ వించుడు.

తా. ఓ చేతనులారా! చిరకాలముగా నేకఛత్రాధిపతులై యున్న మహా రాజులుగూడ శత్రువులచే నపహరింపఁబడిన తమ రాజ్యములుగలవారై, పిదప భిక్షమెత్తుకొనుటకై, లోకులు చూచుదురని సిగ్గుచే రాత్రులయందు ఇండ్లపంచల నీడలయందు బయలుదేరివచ్చెడిసమయంబున యాపంచలయందు పిల్లలుపెట్టియున్న నల్లని కుక్కను చీకటిలోజూడక త్రొక్కగా యాకుక్కచే కఱవబడిన కాళ్లుగల వారై తనుచేతనున్న చట్టిపెంకునుగూడ హఠాత్తుగా క్రిందపడవేసికొని బాధచే బొబ్బలిడగా నప్పుడు సమస్తజనులును వచ్చి చూచి అయ్యో! మనరాజు కింత యవస్థవచ్చెనని చెప్పుకొందురు గాన యిట్టి యస్థిరములైన ఐశ్వర్యముల నాశింపక

కాలము నొక్కింతయైన వ్యర్థపుచ్చక శ్రియఃపతియొక్క శ్రీపాదములనుధ్యానించి యుజ్జీవింపుడు. ... ... ... ... ౧

ఉయ్ విల్ తిత్త్రై కొణర్న్దు ఎన్తులకాణ్డవర్ * ఇమ్మైయే
తమ్మిల్ శువై మడవారై ప్పిఅర్ కొళ్ళత్తామ్ విట్టు *
వెమ్మినొళి వెయిల్ కానకమ్బోయ్ క్కుమైత్తిన్బర్ కళ్ *
శెమ్మిన్ముడి త్తిరుమాలై విరైన్దడి శేర్మినో. ౨

తిత్త్రై కొణర్న్దు ఉయ్విల్ ఎన్తు ఉలకు ఆణ్డవర్ ఇమ్మైయే తమ్ ఇల్ శువై మడవారై పిఅర్ కొళ్ళ తామ్ విట్టు వెమ్ మిన్నొళి వెయిల్ కానకమ్ పోయ్ కుమైత్తిన్బర్ కళ్ శెమ్మిల్ ముడి తిరుమాలై విరైన్దు అడి శేర్మిల్.

పన్నును తీసియిచ్చి బ్రతుకుఁడు అని చెప్పి లోకములను పరిపాలించిన మహారాజులు ఈజన్మమందే తమకు ప్రియురాలై రసమును బుట్టించువారైన స్త్రీలను శత్రువులు పరిగ్రహించునట్లు తమరే విడిచిపెట్టి క్రూరమై ఎండమావులుగల ఎండ కాయుచున్న అడవులకు వెళ్ళి బాధపడుదురు (గాన) ఎట్టనికాంతిగల కిరీటముగల శ్రియఃపతిని శీఘ్రముగా పాదముల నాశ్రయించుడు.

తా. మాకు పన్నులుకట్టి మీరు బ్రతుకుడని ఇతరరాజులనుగూర్చి బలికెడి చక్రవర్తులుగూడ నాజన్మనుందే శత్రువులచే జయింపబడి తమకు ప్రాణప్రియురాండ్రైన భార్యలనుగూడ నాశత్రువులకు తాముగానే యొప్పగించి యెండమావులచే నిండియున్న యడవులయందు మండెడి యెండలయందు దిరుగుచు నలవిలేని బాధలను బొందుదురు గాన ఓ జనులారా! అస్థిరములైన యీసంపత్తులనాశింపక కెంపులుచెక్కియున్న కిరీటముగల శ్రియఃపతియొక్క శ్రీపాదములనాశ్రయించుడు. ... ... ... ... ౨

అడిశేర్ ముడియినరాకి అరశర్ కళ్ తామ్తొழு *
ఇడిశేర్ మురశజ్గళ్ ముత్ఱత్తియమ్బవిరున్దవర్ *

పాడి శేర్ తుళాయ్ ప్పోవర్ కళ్ ఆతలిల్ నొక్కన *
కడి శేర్ తుళాయ్ ముడిక్కణ్ణ కళల్ కళ్ నినైమినో. 3

అడి శేర్ ముడియిన రాకి అరశర్ కళ్ తామ్ తొళ ఇడి శేర్ మురశజ్గళ్ ముత్తిత్తు ఇయమ్బ ఇరున్ద వర్ పాడి శేర్ తుళాయ్ పోవర్ కళ్ ఆతలిల్ నొక్కన కడి శేర్ తుళాయ్ ముడి కణ్ణ కళల్ కళ్ నినైమిన.

తమపాదములలో చేరియున్న కిరీటములు గలవారై అన్యరాజులు తామే ఆశ్రయించునప్పుడు పిడుగుతో సమానమైన మద్దెలవాద్యములు ముంగిళ్లయందు ఘోషించునటుల నున్న రాజులు ధూళితోసమానముగా విలువలేక పోవుదురు గనుక శీఘ్రముగా పరిమళము చేరియున్న తులసీమాలికలచే నలంకరింపబడిన కిరీటముగల శ్రీకృష్ణునియొక్క శ్రీపాదములను ధ్యానింపుడు.

తా. ఇతరరాజులు తమ కిరీటములను పాదములయందు బడునట్లు వంచినను వారిని లక్ష్యబెట్టకనుండి మద్దెళ్ళు పిడుగుతో సమానముగా మ్రోగుచున్న తమ ముంగిలి ప్రదేశములలో కూర్చుండి సుఖము ననుభవించిన మహారాజులుగూడ కొంతకాలమునకు రాజ్యభ్రష్టులై ధూళితోసమానముగా విలువలేనివా రగుదురు గాన మీరు నశ్వరైశ్వర్యములను విడిచి తిరుత్తుళాయిమాలచే బరిమళించుచున్న శ్రీకృష్ణుని శ్రీపాదముల నాశ్రయించుడు. ... ... 3

నినైప్పాన్ పుకిల్ కడలెక్కలిల్ నుణ్మలిల్ పలర్ *
ఎనైత్తోరుకజ్గళుమ్ ఇవ్వులకాణ్డుకళిన్దవర్ *
మనైప్పాల్ మరుజ్గల మాయ్ తలల్లాల్ మత్తిలక్కణ్డిలమ్ *
పనైత్తాళ్ మతకళిఱట్టవన్ పాతమ్ పణిమినో. ర

నినైప్పాన్ పుకిల్ ఎనైత్తోరుకజ్గళుమ్ ఇ ఉలకు

తలంచుటకు నారంభించినయెడల అనేక యుగములయందును ఈ లోకములను పరిపాలించి గడచిపోయినవారు సముద్రతీరమునందలి ఇసుక

ఆణ్డు కழிన్ద వర్ కడల్ ఎక్క-లిల్ నుణ్మణలిల్ పలర్ మనై ప్పాల్ మరుఙ్గు అఱ మాయ్ తలల్లాల్ మఱ్ఱు కణ్డిలమ్ పనై తాళ్ మదకళిఱు అట్ట వర్ పాతమ్ పణిమిన్.

గుంపునందలి సూక్ష్మమైన ఇసుకలకంటె అధికులై యుందురు. ఇంటిచోటును ప్రక్క-చోటును గురుతులేకుండునట్లు నశించిపోవుటయేగాక వేఱు చూచినవారము గాము. (గాన) తాటిచెట్టువలె నున్న కాళ్లుగల మత్తగజమైన కువలయాపీడ మును చంపినవానియొక్క- శ్రీపాదములను ఆశ్ర యించుడు.

తా. పూర్వము నీభూమిని పరిపాలించి యైశ్వర్యవంతులైయుండి పిదప మృతినొందిన మహారాజులను సంఖ్యచేయుట కారంభించినచో సముద్రతీరమునం దున్న యతి సూక్ష్ములైన యిసుకలవలె యసంఖ్యాకులై యుందురు. అదియే గాక వా రభిమానించియున్న గృహములకును నాగృహసమీప ప్రదేశమునకును భేదము తెలియకున్న ట్లవియు నశించునుగాన ఓ! చేతనులారా! మీరు ఆశ్రయణ విరోధులను బోగొట్టు స్వభావుడైన భగవంతునియొక్క- పాదారవిందముల నాశ్ర యించి యుజ్జీవింపుడు. ... ... ... ౪

పణిమిన్ తిరువరుళెన్నుమ్ అఞ్జీతప్పైమ్పూమ్పళ్ళి *
అణిమెన్కుழలార్ ఇన్బక్కలవియముతుణ్డార్ *
తుణిమున్బునాల పల్లాయియర్ తామిழிప్పచ్చెల్వర్ *
మణిమిన్ను మేని నమ్మాయవన్పేర్ శొల్లి వాழ்మినో. ౫

అమ్ శీతమ్ పై పూమ్పళ్ళి తిరువరుళ్ పణిమిన్ ఎన్నుమ్ అణి మెన్ కుழలార్ ఇన్బక్కలవియముతు

సుందరమును చల్లనిదియు విశాలమును నైన పుష్పశయనమునందు కృపచేయవలయు నని యెడి (ఆదరముకల) అలంకారముచే నధికమును మృదువునునైన కేశపాశముకల స్త్రీలయొక్క- ఆనందాత్మకసంశ్లేష మనియెడి యమృతమును భుజించినవారు వస్త్రము (వెనుకకందనందున)

ఉణ్డార్ తుణి మున్బు నాల పల్ ఏ న్తెయర్ తామ్ ఇవ్విప్ప శెల్వార్ మణి నిన్ను మేని నమ్ మాయవర్ పేర్ శొల్లి వాళ్ మిర్.

మునుపటిభాగమునందు వ్రేలాడునట్లు అనేకవిధ ములైన చపలములుగల స్త్రీలు తామే అనాద రోక్తులు చేయఁగా (ఆశచే) నచ్చుటికేగుదురు (గాన) నీలరత్నమువలె ప్రకాశించుచున్న విగ్ర హముకల మన ఆశ్చర్యభూతుఁడైన భగవంతుని యొక్క తిరునామములను అనుసంధించి యుజ్జీ వింపుఁడు.

తా. అతి సుందరమగు శరీరముకల స్త్రీలు సంపద కాశపడి యత్యాదర ముతో నున్నవారివలె నభినయించి దివ్యపుష్పశయనముమీఁద తాము కృపఁ జేయవలయునని ప్రార్థింపగా నాస్త్రీలతో నానందముగ సంశ్లేషించి వారి యధరా మృతపానముఁజేసి సంతోషించినట్టివారే తమ కాసంపద నశించినపిదప పూర్వ వాసనచే నాస్త్రీలగృహమునకు వెళ్ళి యాస్త్రీలచే నుపేక్షింపఁబడినవారై యతి దీనులై తిరుగుదురు. ఓ! చేతనులారా! ఇట్లభిమతసంశ్లేషమును నస్థిరమైనందున నిరతిశయభోగ్యమైన దివ్యమంగళవిగ్రహముకల భగవంతునియొక్క తిరునామ ములననుసంధించి యుజ్జీవింపుఁడు. ... ... ౫

వాళ్న్దార్ కళ్ వాళ్న్దతుమామన్తై మొక్కలిల్ మాయ్న్దుమాయ్న్దు*
ఆళ్న్దారెన్డల్లాల్ అన్డుముతలిన్ద ఉటియా *
వాళ్న్దార్ కళ్ వాళ్న్దేనిఱ్పర్ ఎన్బతిల్లైనిఱ్కుటిల్ * .
ఆళ్న్దార్ కడఱ్పళ్ళి అణ్ణలడియవరామినో. ౬

వాళ్న్దార్ కళ్ వాళ్న్దతు మామన్తై మొక్కలిల్ మాయ్న్దుమాయ్న్దు ఆళ్న్దార్ ఎన్డల్లాల్ అన్డుముతల్ ఇన్డుఱుతియా వాళ్న్దార్ కళ్

(తమ్ములను) చక్కగా జీవించువారలుగా నెంచియుండువారు జీవించునది గొప్పవర్షమునందు బుద్బుదములవలె నశించి నశించి క్రిందపడిరి అనుట తప్ప ఆజన్మదినము మొదలు ఈదినమువఱకు జీవించువారు ఏకరూపముగ జీవించుచు నుందురు

వాழ்ந்தే నిఱ్పర్ ఎన్బతు ఇల్లై నిఱ్కుఱిల్ ఆழ்న్దు ఆర్ కడల్ పళ్ళి అణ్ణల్ అడియవర్ ఆమినే.

అనియెడి యర్థము లేదు. (జీవనము) స్థిరముగ నుండవలసినచో లోతుకలదియు పూర్ణమునునైన సముద్రమును శయనముగాఁగల సర్వస్వామికి శేషభూతులు అగుఁడు.

తా. చక్కనిజీవనముతోఁ గూడినవారని తలచియున్న వారియొక్క సుఖజీవనము జలబుద్బుదములవలె యత్యల్పకాలమందు నశించుటచే సృష్టికాలము మొదలు యీ ముహూర్తమువఱకు నీలోకమునం దేకరూపముగ జీవించువా రెవరును లేరు గాన ఓ! చేతనులారా! మీరు నిత్యసిద్ధమైన యైశ్వర్యమును గోరినచో ఆశ్రితసంరక్షణార్థముగఁ క్షీరార్ణవమునందు నిద్రించుచున్న శ్రియఃపతియొక్క పాదపద్మములయందుఁ గైంకర్యమనియెడి నిత్యపురుషార్థమును బ్రార్థింపుఁడు. ౬

ఆమినే శువైయవై ఆఱోడడిశిలుణ్డార్ నదప్పిఁ *
తూమెన్మొழிమడవారిరక్క ప్పిన్నుమ్ తుఱ్ఱువార్ *
ఈమినెమక్కొరుతుఱ్ఱెన్ఱు ఇడఱువరాతలిల్ *
కోమినే తుழ்ఱాయ్ ముడి ఆతియఞ్జోతికుణఙ్గళే. ౭

ఆమ్ ఇనే అవై ఆఱు శువై యోడు అడిశిల్ ఉణ్డు ఆర్ నదప్పిఁ తూ మెన్ మొழி మడవార్ ఇరక్క పిన్నుమ్ తుఱ్ఱువార్ ఎమక్కు ఒరు తుఱ్ఱు ఈమినే ఎన్ఱు ఇడఱువర్ ఆతలిల్ తుழ்ఱాయ్ ముడి

స్వభావానుగుణములును మనోహరములును ప్రసిద్ధములును నైన ఆఱురసములతోఁ గూడిన అన్నమును భుజించి పూర్ణులైనపిదప (ప్రీతిచే) శుద్ధములును శ్రావ్యములును నైన భాషణములుకల వినయముకలస్త్రీలు అపేక్షించుచున్నప్పుడు (దానిని మఱువలేక) మఱల భుజించువారు (ఆసంపద నశించినపిదప యాస్త్రీలుండు చోటికి వెళ్ళి) మాకు ఒక ముష్టియన్నము ఇమ్మని యపేక్షించి (అది లభింపకున్నను) ప్రతివాకిలి

ఆతి అమ్ శ్రోతి కుణజ్గళ్ కోమ్మిణ్.

తిరుగుదురు; అందువలన తులసీమాలచే నలంకృత మైన శిరస్సుకలవాఁడును సర్వకారణభూతుఁడును దర్శనీయమైన తేజోమయదివ్యమంగళవిగ్రహము కలవాఁడును నైన భగవంతునియొక్క గుణము లను అనుసంధింపుఁడు.

తా. షడ్రసములతోఁగూడి యతి విలక్షణమైన యన్నమును పూర్ణముగ భుజించినవెనుక అతి మధురభాషణములుకల సుందరస్త్రీలు దీనిని బుచ్చుకొౌన వలయునని ప్రార్థింప వారి మృదుభాషణములకు వశపడి మఱల భుజించువారే తమసంపద నశించినచో యాస్త్రీలుండు స్థలమునకువెళ్ళి యొక ముష్టిపరిమితా న్నము నాకిమ్మని ప్రార్థింపఁగా నది లభింపనందున వారి వాకిలియందుఁ దిరుగు టచే నన్నపానాదులును నస్థిరములు గాన ఓ! చేతనులారా! మీరు నిరవధిక భోగ్యభూతుఁడగు శ్రియఃపతియొక్క దివ్యకల్యాణగుణములను అనుసంధించి యుజ్జీవింపుఁడు. ... ... ... ... ౭

కుణజ్గొళ్ నిఱైపుకళ్ మన్నర్ కొడైక్కడర్ పూణ్డిరున్దు *
ఇణజ్గియులకుడనాక్కిలుమ్ ఆజ్గవనై యిల్లార్ *
మణజ్గొణ్డపోకత్తుమన్నియుమ్మీళ్ వర్ కళ్ మీళ్వెల్లై *
పణజ్గొళరవణై యాన్ తిరునామమ్పడిమినో. ౮

కుణమ్ కొళ్ నిఱై పుకళ్ మన్నర్ కొడై కడర్ పూణ్డు ఇరున్దు ఇణజ్గి ఉలకు ఉడనాక్కిలుమ్ ఆజ్గు అవనై ఇల్లార్ మణమ్ కొణ్డ పోకత్తు మన్నియుమ్ మీళ్వర్ కళ్

గుణములకు స్థానభూతులును పూర్ణమైన యశస్సుకలవారును నైన రాజులు ఔదార్యమని యెడి స్వభావమును ధరించియున్నవారలగుచు అమరి లోకులు విడువకుండునట్లు రక్షించువారైనను, ఆయైశ్వర్యవిషయముగ నాసర్వేశ్వరుని (నాశ్రయించుట) లేనివారు ఆనందము కల భోగ మునందు, సుస్థిరులైనను భ్రష్టైశ్వర్యు లగుదురు.

మిాళ్వాలై పణజ్గొళ్ అరవు అణైయార్ తిరునామమ్ పడిమిన్.

పునరావృత్తిలేని పురుషార్థమునకు (ఆశించినచో) పడిగెలుకల ఆదిశేషుని శయనముగాఁ గలవాఁడైన శ్రియఃపతియొక్క తిరునామములను అభ్యసింపుఁడు.

తా. అనాదికాలముగ ననవరతము క్షత్రధర్మము ననుష్ఠించి సకలలోకములను వశపఱచుకొనియున్న రాజులకును భగవంతుని నాశ్రయింపనియెడల రాజ్యము సిద్ధింపదు. అట్లాశ్రయించి లభించినను నాసంపద స్వల్పకాలమే యుండును గాన ఓ! చేతనులారా! తన నాశ్రయించినవారిని విడువకుండు స్వభావముకల సర్వేశ్వరునియొక్క తిరునామములను నాదరముతో నభ్యసించి యుజ్జీవింపుఁడు. ... ... ... ... ౮

పడిమన్ను పల్ కలన్ పఱ్ఱోడఱుత్తు ఐమ్బులన్వెన్ఱు *
శెడిమన్ను కాయమ్ శెఱ్ఱార్ కళుమ్అఙ్గవనై యిల్లార్ *
కుడిమన్ను మిన్ శువర్క్క మెయ్ తియుమ్మిాళ్వార్ కళ్ మిాళ్వాలై *
కొడిమన్ను పుళ్ళుడై అణ్ణల్ కழல் కళ్ కుఱుకుమినో.

౯

పడి మన్ను పల్ కలన్ పఱ్ఱోడు అఱుత్తు ఐమ్బులన్ వెన్ఱు శెడిమన్ను కాయమ్ శెఱ్ఱార్ కళుమ్ మన్నుమ్ కుడి ఇన్ శువర్క్కమ్ ఎయ్ తియుమ్ అవనై అఙ్గు ఇల్లార్ మిాళ్వార్ కళ్ మిాళ్వాలై కొడి మన్ను పుళ్ ఉడై అణ్ణల్ కழల் కళ్ కుఱు కుమిన్.

భూమియు ఎల్లప్పుడు ధరింపఁబడిన అనేకవిధములగు ఆభరణములను సంగముతో విడిచి పంచేంద్రియములను జయించి మలముతోఁగూడియున్న శరీరమును కృశింపఁజేసినవారును కల్పాంతమువరకు స్థిరమును జనసమృద్ధికలదియు సుఖోత్తరమును నైన స్వర్గమును బొందినవారైనను ఆసర్వేశ్వరుని నచ్చటనుండి ఆశ్రయింపనివారు యధఃపతితు లగుదురు. నాశములేని ఫలమునకు (యిచ్ఛగించినచో) ధ్వజమునందు నిత్యముగ వసించు గరుత్మంతుని వాహనముగాఁగల సర్వస్వామియొక్క పాదములను ఆశ్రయింపుఁడు.

తా. సకలములైన యైహికభోగములను నస్థిరములని తలచి సవాసనముగ త్యజించినవారై తమ బాహ్యేంద్రియములను వశపఱచుకొని యనేక కాలములయం దతిఘోరముగఁ దపస్సుజేసి స్వర్గఫలమును బొందినవారును నాఫలప్రదుఁడగు భగవంతుని నాశ్రయింపనియెడల పుణ్యము క్షయించినప్పుఁడు భూలోకమునందుఁ బడి దుఃఖింతురు గాన ఓ! చేతనులారా! మీకు పునరావృత్తిలేని ఫలమును బొందవలసియున్నచో గరుడధ్వజుఁడైన సర్వస్వామిని ఆశ్రయింపుఁడు.

కఱుకమికవుణర్వ్వత్తోడునోక్కి యెల్లామ్‌విట్ట *
ఇఱుకలిఱప్పెన్నుమ్‌ఞానిక్కుమ్‌అప్పయనిల్లైయేల్ *
శిఱుకనినైవతోర్ పాశముణ్డామ్ పిన్నుమ్‌వీడిల్లై *
మఱుకలిలీశనైప్పఱ్ఱి విడావిడిల్ వీడఃతే. ౧౦

కఱుక ఉణర్వ్వత్తోడు మికనోక్కి ఎల్లామ్ విట్ట ఇఱుకల్ ఇఱప్పు ఎన్నుమ్ ఞానిక్కుమ్ అప్పయన్ ఇల్లైయేల్ శిఱుక నినైవతోర్ పాశమ్ ఉణ్డామ్ పిన్నుమ్ వీడు ఇల్లై మఱుకలిల్ ఈశనై పఱ్ఱి విడావిడిల్ అఃదే వీడు.

విషయాంతరములనుండి మనస్సును మఱలించియు జ్ఞానముకల జీవాత్మతోఁ జేర్చియు దర్శనసమానాకార మగున ట్లనుసంధించియు (ఆత్మేతరములగు) సకలపురుషార్థములను త్యజించినవాఁడై సంకోచమును మోక్షము అని తలచి యుండు ఆత్మజ్ఞానవంతునికిని (సర్వేశ్వరుని స్వయం ప్రయోజనముగ నాశ్రయించుట యనియెడి) పురుషార్థము లేనియెడల అల్పపురుషార్థములను స్మరించుటకుఁ గారణమైన సంగము కలుగును. అదిగాక మోక్షమును సిద్ధింపదు (గాన) హేయస్పర్శము లేని సర్వేశ్వరుని నాశ్రయించి (ప్రయోజనాంతరములను గొని) విడువకున్నచో అదియే పరమ పురుషార్థము.

తా. ప్రాకృతవిషయములయందు వైరాగ్యపూర్వకముగ జీవాత్మను దర్శన సమానాకారకజ్ఞానముచే సాక్షాత్కరించి యదియే మోక్షమని భ్రమించియుండు జ్ఞానయోగనిష్ఠునికిని సర్వేశ్వరుని స్వయంప్రయోజనముగ నాశ్రయింపకపోయి నచో నికృష్టపురుషార్థములకు స్మారకమగు సంగము సమూలముగ నివృత్తము కాదు; అదియేగాక ఆత్మప్రాప్తిరూపమైన మోక్షమును సిద్ధింపదు; గాన సమస్త హేయప్రతిభటుఁడైన సర్వేశ్వరుని ననన్యప్రయోజనముగ నాశ్రయించి వానిని విడువకుండుటయే మీకుఁ బరమపురుషార్థమైన మోక్షము. ... ౧౦

* అంి తేడయ్యప్పుకుమాఱెన్ఱు కణ్ణకழల్ కళ్ మేల్ *
కొయ్ పూ మ్పొழில్ శూழ் కురుకూర్చ్చడకోపఙ్ కుఱ్ ఱేవల్ *
శెయ్ కోలత్తాయిరమ్ శీర్త్తొడై ప్పాడలివై పత్తుమ్ *
అంికామల్ కల్పవర్ ఆழ் తుయర్ పోయుయ్యప్పాలరే. ౧౧

ఉజ్జీవించుటకు సమీపించు ఉపాయము అదియే అని సాదించి కృష్ణునియొక్క పాదముల యందు కోయబడిన పుష్పసమృద్ధికల తోటలుకల తిరునగరికి నిర్వాహకులైన ఆழ்వార్ల అంతరంగ కైంకర్యరూపముగ సాదించిన అలంకారముచేఁ బూర్ణములును సహస్రసంఖ్యాకలవియు కల్యాణ గుణములను గ్రుచ్చిన గానరూపములును నైన (తిరువాయ్ మొழிయందు) ఈ పదిపాశురములను నొకటియు విడువక నభ్యసించువారు అగాధమైన దుఃఖము నశించి ఆత్మోజ్జీవనమే స్వభావముగాఁ గలవారగుదురు.

ఉయ్య పుకుమ్ ఆఱు అంిదే ఎన్ఱు కణ్ణ కழల్ కళ్ మేల్ కొయ్ పూపొழில் శూழ் కురుకూర్ శడకోపఙ్ కుఱ్ ఱేవల్ కళ్ శెయ్ కోలమ్ ఆయిరమ్ శీర్ త్తొడై పాడల్ ఇవై పత్తుమ్ అంికామల్ కల్పవర్ ఆழ் తుయర్ పోయ్ ఉయ్యప్పాలర్.

తా. శ్రియఃపతియొక్క శ్రీపాదములే యాత్మోజ్జీవనోపాయమని యాழ்వార్లు సాధించినవియు భగవదంతరంగ కైంకర్యరూపములును సర్వలక్షణసంపన్నము

లును నైన వేయిపాశురములలో నంతర్భూతములును భగవద్గుణప్రతిపాదకము లును నైన యీ పదిపాశురములను నభ్యసించువారు నిరవధిక సుఖరూపమైన మోక్షమును బొంది యానందింతురు. ... ... ౧౧

ప్రథమదశకము ముగిసెను.

ఆళ్వార్ తిరువడికళే శరణమ్.

---

## ద్వితీయదశకము — పాలనాయ్

అతీతకాలభోగములను ఆశపడుట.

* పాలనాయ్ ఏళులకుణ్డుపరివిన్ఱి *
ఆలిలై యన్నవశఞ్జెయ్యుమణ్ణలార్ *
తాళిణై మేలణి తణ్ణన్దుళాయెన్ఱే
మాలుమాల్ * వల్వినై యేఱ్ఱమడవల్లి యే. ౧

పాలనాయ్ ఏళులకు ఉణ్డు పరివు ఇన్ఱి ఆలిలై అన్న వశమ్ శెయ్యుమ్ అణ్ణలార్ తాళిణై మేల్ అణి తణ్ అమ్ తుళాయ్ ఎన్ఱే మాలుమ్ వల్ వినై యేఱ్ఱ మడమ్ వల్లి.

బాలుఁడై ఏడులోకములను భుజించి ఉపద్రవము లేకయే వటపత్రమునందు అన్నము జీర్ణింపకుండునట్లు శయనించియున్న స్వామియొక్క రెండుపాదములమీఁద సమర్పించిన చల్లని సుందరములైన తులసీదళములను (పొందవలయును) అనియే మోహించును బలిష్ఠమైన పాపముకల నాయొక్క నమ్రతతోఁగూడిన తీగవంటి చిన్నది.

తా. ప్రళయకాలమునందు సకలలోకములను దన యుదరమునందుంచి యాపద రానీయక రక్షించిన సర్వస్వామియొక్క దివ్యపాదారవిందద్వంద్వమునం దమరు లత్యాదరముతో సమర్పించిన దివ్యతులసీదళములను యిప్పుడే పొందవలెనని యాశపడి యది దుర్లభంబైనందున సుకుమారమైన శరీరముకల నాకూతురు మిక్కిలి మోహించుచున్నది యని తల్లి యడిగినవారికి జెప్పుచున్నది.

వల్లి శేర్ నుణ్ణిడై ఆయ్ చ్చియర్ తమ్మొడుమ్ *
కొల్లమై శెయ్ తు కురవై పిణై న్దవర్ *
నల్లడిమేలణి నాఱుతుழ్రాయెన్ఱే
శొల్లుమాల్ * శూழ్వినై యాట్టియేన్ పావై యే. ౧

వల్లి శేర్ నుణ్ ఇడై ఆయ్ చ్చియర్ తమ్మొడుమ్ కొల్లమై శెయ్ తు కురవై పిణై న్దవర్ నల్ అడిమేల్ అణి నాఱు తుழ్రాయెన్ఱే శొల్లుమ్ శూழ్ వినై యాట్టియేన్ పావై. తీగతో సమానములై సూక్ష్మములైన మధ్యములుకల గోపస్త్రీలతో సమానముగ (వారి మానభంగమగునట్లు) అవధిలేని వ్యాపారములను జేసి (వారితో) రాసక్రీడ చేసినవానియొక్క సుందరములైన పాదములయందు సమర్పింపఁబడి పరిమళముచే నధికమైన తులసియనియే చెప్పు చున్నది ఆవరించుకొనిన పాపములుకల నాయొక్క కూతురు.

తా. అతి సూక్ష్మమైన నడుముకల గోపస్త్రీలయొక్క మధ్యమునందు వారితో రాసక్రీడచేసి వారి మానభంగముచేసిన సర్వసులభునియొక్క నిరవధిక తేజోమయ దివ్యపాదారవిందములయందు సమర్పింపఁబడి పరిమళోత్తరమైన తులసియనియే నాచిన్నది సర్వకాలములయందును చెప్పుచున్నది. తన యభిప్రాయమును నెల్లప్పుఁడితరులకు తెలిపింపని స్త్రీత్వముకల యీచిన్నది ఇట్లు చెప్పుటకు నిమిత్తము నాయొక్క మహాపాపమే. ... ... ... ౧

పానియల్వేత నన్మాలై పలకొణ్డు *
తేవర్ కళ్ మామునివర్ ఇఱైఞ్జనిన్ఱ *
శేవడిమేలణి శెమ్బొన్ తుழ్రాయెన్ఱే
కూవుమాల్ * కోళ్వినై యాట్టియేన్ కోతై యే. 3

పా ఇయల్ వేతమ్ నల్ పల మాలై కొణ్డు ఛందస్సునందు వర్తించుచున్న ఋగ్వేదములను దివ్యములై అనేకవిధములైన మాలలను

తేవర్ కళ్ మా మునివర్ ఇఱైఞ్జ నిన్ఱ శే అడిమేల్ అణి శెమ్ పోన్ తుழాయెన్ఱే కూవుమ్ కోళ్ విన్నై యాట్టి యేన్ కోతై.

గొని దేవతలును శ్రేష్ఠులైన ఋషులును ఆరాధించునట్లు (లోకములను గొలిచి) వేంచేసియున్న ఎట్టని పాదములయందు సమర్పించిన ఎట్టని సువర్ణమువలె సుందరమైన తులసీదళములను జెప్పియే కూతలిడుచున్నది. ప్రబలమైన పాపముకల నాయొక్క పువ్వమాలవంటి చిన్నది.

తా. దేవతలును ఋషులును ఋగ్వేదమును ననుసంధించుచు దివ్యపుష్పములచే నారాధించిన త్రివిక్రమావతారంబెత్తిన భగవంతునియొక్క దివ్యపాదారవిందములయందున్న తులసీమాలను గోరియే నాచిన్నది ఎల్లప్పుఁడు కూతలిడుచున్నది. ... ... ... ... 3

కోతిలవణ్బుకழ் కొణ్డుశమయికళ్ *
పేతఙ్గళ్ శొల్లి ప్పితఱ్ఱుమ్‌పిరాన్ పరన్ *
పాతఙ్గళ్ మేలణి పై మ్బొழ్ఱుழాయెన్ఱే
ఓతుమాల్ * ఊழ్విన్నై యేన్ తడమ్‌తోళియే. ౪

కోతు ఇల వణ్ పుకழ் కొణ్డు శమయికళ్ పేతఙ్గళ్ శొల్లి పితఱ్ఱుమ్ పిరాన్ పరన్ పాతఙ్గళ్ మేల్ అణి పై పోన్ తుழాయెన్ఱే ఓతుమ్ ఊழ్విన్నై యేన్ తడమ్ తోళి.

దోషములేని విలక్షణములైన గుణములను గొని స్థిరులైన (నిత్యముక్తులు) (ఆయా గుణాధిక్యములకు) భేదములను జెప్పి అక్రమముగాఁ బలుకునట్లు చేయుచున్న మహోపకారకుఁడగు సర్వస్వామిప్రభునియొక్క పాదములమీఁద సమర్పించిన పచ్చని సుందరమైన తులసియనియే చెప్పుచున్నది అనాదిసిద్ధమైన పాపముకల నాయొక్క వర్తులాకారముకల భుజములుకల చిన్నది.

తా. తన యుత్కర్షముకొఱకు కనియెడి దోషములేని పరార్థమైయేయుండు దివ్యకల్యాణగుణములయందు అవగాహించియుండు నిత్యముక్తులు ఆగుణోత్కర్షములయందు భేదములను బలుమాఱు క్రమముగఁ జెప్పునట్లు వారిని వశపఱచుకొనిన మహోపకారకుఁడైన శ్రియఃపతియొక్క పాదారవిందములయందు సమర్పించియున్న దివ్య తులసీమాల నపేక్షించి, సుందరములైన భుజములుకల నాచిన్నది పలుమారు పలుకుచున్నది. ... ... ౪

తోళిశేర్ పిన్నై పొరుట్టు ఎరు తేழ் తழீ
కోళియార్ * కోవలనార్ కుడక్కూత్తనార్ *
తాళిణై మేలణి తణ్ణన్దుழாయెన్ఱే
నాళునాళ్ * నైకిన్ఱ తాల్ ఎన్ఱన్ మాతరే. ౫

తోళి శేర్ పిన్నై పొరుట్టు ఎరుతు ఏழ் తழீ కోళియార్ కోవలనార్ కుడక్కూత్తనార్ తాళిణై మేల్ అణి తణ్ అమ్ తుழாయెన్ఱే నాళునాళ్ ఎన్ఱన్ మాతర్ నైకిన్ఱతు.

ప్రసిద్ధములైన భుజములుకలదియు (శీలాది గుణములచే) వానితో సమానమైనదియు నైన నప్పిన్నపిరాట్టికొఱకు వృషభములను ఏడింటిని సంహరించిన స్వభావముకలవాఁడును గోపకులము కలవాఁడును కుంభనర్తనమనియెడి (దివ్యచేష్టితము కలవాఁడును నైన కృష్ణునియొక్క) పాదయుగ్మముమీఁద సమర్పించిన చల్లని సుందరమైన తులసియనియే ప్రతిదినము నాచిన్నది యనుసంధించుచున్నది.

తా. సర్వేశ్వరుఁ డాశపడునట్లు మనోహరములై పరస్పర సదృశములైన భుజములుకల నప్పిన్నపిరాట్టిని పొందుటకుగాను ఏడు వృషభములను సంహరించినవాఁడును గోపకులమునందు వారితో సజాతీయుండై యవతరించిన సర్వసులభుఁడును తన దివ్యచేష్టితములను వారికి ననుభవపఱచినవాఁడును నైన కృష్ణునియొక్క పాదారవిందములయం దాదరముతో నిత్యముక్తులు సమర్పించిన తులసియనియే నాచిన్నది పలుమా రనుసంధించుచున్నది. ... ౫

మాతర్ మామణ్మడన్దైపొరుట్టుఏనమాయ్ *
ఆతియమ్ కాలత్తు అకలిడజ్గీణ్డవర్ *
పాతఙ్గళ్ మేలణి పై మ్బొల్ తుళాయెన్టే *
ఓతుమాల్ ఎయ్ తినళెన్టన్మడన్దైయే. ౬

మాతర్ మా మణ్మడన్దైపొరుట్టు ఏనమాయ్ ఆతి అమ్ కాలత్తు అకల్ ఇడమ్ కీణ్డవర్ పాతఙ్గళ్మేల్ అణి పై మ్బొన్ తుళాయెన్టే ఓతుమ్ మాల్ ఎయ్ తినళ్ ఎన్టన్ మడన్దై.

స్త్రీలలో మిక్కిలి శ్రేష్ఠురాలును శ్లాఘ్యురాలును నైన శ్రీభూమిపిరాట్టికొఱకు వరాహవేషమును ధరించినవాఁడును కల్పాదియు సుందరమును నైన కాలమునందు విశాలమైన భూమిని పైకెత్తినవాఁడును నైన శ్రియఃపతియొక్క పాదములమీఁద (సనకాది పరమఋషులు) సమర్పించిన పచ్చని సుందరమైన తులసియనియే ఎల్లప్పుఁడు పలుకునట్లు వ్యామోహమును బొందినది నాసన్నుతకల చిన్నది.

తా. తన దివ్యరూపమును బోఁగొట్టుకొనియు వరాహావతారం బెత్తి శ్రీభూమి పిరాట్టికి నుపకరించిన పరమోపకారకునియొక్క పాదారవిందంబులయందు పరమఋషులు పరమభక్తితో సమర్పించి తులసీదళములను గోరినదై నాచిన్నది వాటినే యనుసంధించుచున్నది. ... ... ... ౬

మడన్దైయై వణ్గమలత్తిరుమాతినై *
తడఙ్గొళ్ తార్ మార్పినిల్ వైత్తవర్ తాళిన్మేల్ *
వడఙ్గొళ్ పూన్దణ్ణన్దుళాయ్ మలర్కే ఇవళ్
మడఙ్గుమాల్ * వాణుతలీరెన్మడక్కొమ్బే. ౭

మడన్దైయై వణ్ కమలమ్ తిరు మాతినై తడమ్ కొళ్ తార్ మార్పినిల్ వైత్తవర్ తాళిన్మేల్ వడమ్ కొళ్ పూ తణ్ అమ్ తుఴాయ్ మలర్ క్కు వాళ్ నుతలీర్ ఎన్ మడమ్ కొమ్బు ఇవళ్ మడఙ్గుమ్.

యౌవనముకలదియు సుందరమైన తామర పుష్పమును వాసస్థానముగాఁ గలదియు తిరు అనియెడి తిరునామముకలదియును నైన స్త్రీని వైశాల్యము కలదియు మాలకలదియు నైన వక్షస్థలమందు ధరించినవానియొక్క పాదములయందు సమర్పించిన గ్రుచ్చుట కలిగిన సుందరమై చల్లని ఎఱ్ఱని తులసీపుష్పమాలకు (ఆశపడి) ఉజ్జ్వలమైన ముఖముకలవారా! నాకు భవ్యురాలై ప్రబ్బ కొమ్మవలె యతి సుందరియైన ఈమె అవసన్నమై పడియున్నది.

తా. నాకు మిక్కిలి భవ్యురాలైన నాచిన్నది అమృత మథనకాలమునందు క్షీరార్ణవమునందుండి యావిర్భవించిన శ్రీదేవిని తన వక్షస్థలమందు ధరించిన భగవంతునియొక్క దివ్యపాదారవిందములయందు సనకాది పరమఋషులు సమర్పించిన తులసీమాలలను ఆశపడి యది లభింపనందున మిక్కిలి మోహించియున్నది. ౭

కొమ్బుపోల్ శీతై పొరుట్టు ఇలఙ్గైనకర్ *
అమ్బెరియుయ్త్తవర్ తాళిణై మేలణి *
వమ్బవిఴ్ తణ్ణన్దుఴాయ్ మలర్క్కే ఇవళ్
నమ్బుమాల్ * నానిత్తక్కెన్ శెయ్ కేన్ నఙ్గైమీర్. ౮

కొమ్బుపోల్ శీతై పొరుట్టు ఇలఙ్గైనకర్ అమ్బెరి ఉయ్త్తవర్ తాళిణై మేల్ అణి వమ్బవిఴ్ తణ్ అమ్ తుఴాయ్ మలర్క్కు ఇవళ్

ప్రబ్బకొమ్మవలె (సుందరురాలును) అహో నిజయగు సీతాదేవికొఱకు లంకానగరమునందు బాణాగ్నిని ప్రవేశించునట్లు చేసిన దశరథ పుత్రునియొక్క పాదయుగ్మమునందు సమర్పించిన పరిమళముతో వికసించియు చల్లనిదై సుందర

నమ్బుమ్ నఙ్గైమీార్ ఇతఱ్కు- నాఙ్ ఎఙ్ శెయ్ కేఙ్.

మైన తులసియొక్క పుష్పమాలకు ఈమె ఆశ పడుచున్నది. ఓ! పూర్ణులారా! ఈ యభినివేశ మునకు నేను ఏమిచేయుదును?

తా. అతి సుందర దివ్యమంగళవిగ్రహముకలదియు అయోనిజయు నైన జనకపుత్రికై తన బాణాగ్నిని లంకయందు ప్రవేశింపజేసి శత్రువులను సంహ రించిన చక్రవర్తి తిరుమకనారియొక్క దివ్యపాదారవిందములలో సమర్పించిన దివ్యతులసీపుష్పములు కావలయునని నాచిన్నది యాశపడుచున్నది; దీనికి నేనేమి చేయుదును? ఓ! సఖులారా! ఈమెయవస్థ చూడుఁడు. ఏకదారవ్రతుఁడైన వానిని గోరుచున్న ఈమెను నేనెట్లు సమాధానపఱచగలను? ఆపుష్పములను నే నెచ్చట వెతకఁగలను? మీరే దీని కుపాయము చెప్పుఁడు. ... ౮

నఙ్గైమీార్ నీరుమ్ ఓర్ పెణ్బెత్ఱునల్ కినీర్ *
ఎఙ్గనేశొల్లు కేఙ్ యాన్బెత్ఱ ఏన్దిళైయై *
శఙ్గెన్నుమ్శక్కరమెన్నుమ్తుళాయెన్నుమ్ *
ఇఙ్గనేశొల్లుమ్ఇరాప్పకలఙ్ శెయ్ కేఙ్. ౯

నఙ్గైమీార్ నీరుమ్ ఓర్ పెణ్ పెత్ఱు నల్ కినీర్. యాఙ్ పెత్ఱ ఏన్దిళైయై ఎఙ్గఙ్ శొల్లు కేఙ్ శఙ్గెన్నుమ్ శక్కరమెన్నుమ్ తుళాయె న్నుమ్ ఇరాప్పకల్ ఇఙ్గనే శొల్లుమ్ ఎఙ్ శెయ్ కేఙ్.

ఓ! పూర్ణులారా! మీరును ఒక పుత్రిని కని పెంచితిరి; నేనుకనిన చపలురాలైన యీామెను ఏమని చెప్పెద? (శక్యమగువఱకు చెప్పినదో) శంఖమనియు చక్రమనియు తులసియనియు రాత్రిం బవళ్లు ఈప్రకారముగాఁ జెప్పుచున్నది దీని కేమి చేయుదును?

తా. ఓ! సఖులారా! మీరును పుత్రికలను కని పెంచుచున్నారుకదా! మీ పుత్రికలలో నెవరైనను యీాప్రకారముగ నవస్థపడుచున్నవారు కలరా!

ఈమెయవస్థను నేనేమని చెప్పెద? అయినను శక్యమగువరకు చెప్పెద వినుఁడు. భగవద్గుణములయం దీమె యవగాహించి వానికి నసాధారణచిహ్నములను శంఖమనియు చక్రమనియు వాని పాదారవిందములయందు సమర్పించిన తులసియనియు నహోరాత్రములు చెప్పుచున్నది; దీనికి నేనేమి చేయగలను? ... ౯

ఎన్ శెయ్ కేన్ ఎన్నుడై ప్పేతై యెన్ కోమళమ్ *
ఎన్ శొల్లుమ్ ఎన్ వశముమల్లళ్ నఙ్గైమీర్ *
మిన్ శెయ్ పూణ్ మార్ పినన్ కణ్ణన్ కழల్ తుழాయ్ *
పొన్ శెయ్ పూణ్ మెన్ ములైక్కెన్ఱు మెలియుమే. ౧౦

నఙ్గైమీర్ ఎన్నుడై పేతై ఎన్ కోమళమ్ ఎన్ శొల్లుమ్ ఎన్ వశముమ్ అల్లళ్ ఎన్ శెయ్ కేన్ మిన్ శెయ్ పూణ్ మార్ పినన్ కణ్ణన్ కழల్ తుழాయ్ పొన్ శెయ్ పూణ్ మెల్ ములైక్కు ఎన్ఱు మెలియుమ్.

ఓ! పూర్ణులైన సఖులారా! నాయొక్క చిన్నదియు మిక్కిలి మార్దవముకలదియు నైన (నాచిన్నది) నావార్తలకును నామనస్సునకును వశపడకున్నది ఏమిచేసెద? కాంతికల ఆభరణములు కల వక్షస్థలముతోఁగూడిన కృష్ణునియొక్క పాదములయందు తులసీదళములను స్వర్ణముచేఁ జేయబడిన ఆభరణములుకల మృదువులగు స్తనములకు (కావలెను) అని యాశపడి (అది లభింపనందున) కృశించుచున్నది.

తా. పరిపూర్ణ జ్ఞానవంతులైన ఓ! సఖులారా! అత్యంత మృదుళమైన శరీరముకలదియు సారాసారవివేకమునకుఁ దగని చిన్నతనముకల యీమె నేను చెప్పిన వార్తలనువినక నా కవశురాలై యున్నది; దీనికి నేనేమిచేసెదను? కృష్ణ విషయమైన విరహమును సహింపజాలక దివ్యభూషణములచే భూషితమైన విశాల వక్షస్థలముకల భగవంతునియొక్క దివ్యపాదారవిందములయం దాదరముతో సమర్పించిన దివ్యతులసీదళములను ఆశపడి యది లభింపనందున శోకాతిశయముచే శిథిలురా లగుచున్నది. ... ... ౧౦

* మెలియునోయ్ తీర్క్కుమ్ నజ్జణ్ణాకళ్గల్ కళ్ మేల్ *
మలిపుకళ్గ్ వణ్గురుకూర్చ్చడకోపన్ శొల్ *
ఒలిపుకళ్గాయిరత్తుఇప్పత్తుమ్వల్లవర్ *
మలిపుకళ్గ్ వానవర్క్కావర్ నల్కోవై యే. ౧౧

మెలియుమ్ నోయ్ తీర్క్కుమ్ నమ్ కణ్ణన్ కళ్గల్ కళ్ మేల్ మలి పుకళ్గ్ వణ్ కురుకూర్ శడకోపన్ శొల్ ఒలి పుకళ్గ్ ఆయిరత్తు ఇప్ప త్తుమ్ వల్లనర్ మలి పుకళ్గ్ వానవర్క్కు నల్ కోవై ఆవర్.

శిథిలురాలగుటకుఁ గారణమైన విరహావ్యసనమును బోఁగొట్టునట్టి ఆశ్రితసులభుఁడైన కృష్ణుని యొక్క పాదములమీఁద వృద్ధినొందిన యశస్సు కలవారును శ్లాఘ్యమైన కురుకాపురికి నిర్వాహకులును నైన ఆళ్వార్లు సాదించిన కొనియాడబడిన గుణములుకల వేయిపాశురములలో ఈ పదిపాశురములను భావబంధముతో నభ్యసించువారు అభివృద్ధమైన (భగవదనుభవముచే వచ్చిన) యశస్సు కల నిత్యసూరులకు శ్లాఘ్యులగుచు వారితోఁ జేరినవారు అగుదురు.

తా. ఈరీతిన భగవద్విషయమైన విరహము సహింపజాలక మిక్కిలి శైథిల్యమునొందువారికి వ్యథను బోఁగొట్టునట్టి దివ్యస్వభావముకలవాఁడును నాశ్రితసులభుఁడును నైన శ్రియఃపతియొక్క దివ్యపాదారవిందముల విషయముగ నత్యాదరముతో నాళ్వార్లు సాదించినవియు భగవంతునియొక్క దివ్యకల్యాణగుణములను ప్రకాశముగఁ బ్రతిపాదించునవియు నైన వేయిపాశురములలో నీ పదిపాశురములను భావబంధముతో నభ్యసించువారు భగవదనుభవమునం దవగాహించుచున్న నిత్యసూరులతో సమాను లగుదురు. ... ... ౧౧

చతుర్థశతకములో ద్వితీయదశకము ముగిసెను.

ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.

---

# తృతీయదశకము — కోవైవాయాళ్

* కోవై వాయాళ్ పొరుట్టుఏళ్ శ్రీ నెరుత్తమిఱుత్తాయ్ * మతిళిలఙ్గై
క్కోవై వీయచ్చిలై కునిత్తాయ్ కులనల్ యానై మరుప్పొశిత్తాయ్ *
పూవై వీయానీర్ తూవి ప్పోతాల్ వణఙ్గేనేలుమ్ * నిన్
పూవై వీయామేనిక్కు పూశుమ్శాన్దెన్నెఞ్జమే. ౧

కోవై వాయాళ్ పొరుట్టు ఏఱ్ శ్రీ ఎరుత్తమ్ ఇఱుత్తాయ్ మతిళ్ ఇలఙ్గై కోవై వీయ శిలై కునిత్తాయ్ కులమ్ నల్ యానై మరుప్పు ఒశిత్తాయ్ పూవై వీయా నీర్ తూవి పోతు వణఙ్గేనేలుమ్ నిన్ పూవై వీయామ్ మేనిక్కు పూశుమ్ శాన్దు ఎన్నెఞ్జమే.

దొండపండువంటి అధరముకల నప్పిన్న పిరాట్టికొఱకు ఎద్దులయొక్క మెడలను విరిచినవాఁడును ప్రాకారములుకల లంకకు నిర్వాహకుఁడైన రావణాసురుని నశించునట్లు ధనుస్సును వంచినవాఁడును ఉత్తమకులమును లక్షణ వైలక్షణ్యమును కల కువలయాపీడమనియెడి గజముయొక్క దంతములను విరిచినవాఁడును నైన (ఓ! సర్వస్వామీ!) పుష్పములను విడువని తీర్థమును సమర్పించి యుక్తకాలములయందు నమస్కరింపనివాఁడనైనను నీయొక్క నల్ల అగసెపుష్పమువంటి కాంతికల దివ్యమంగళవిగ్రహమునకు పూయతగిన చందనము నామనస్సగుట యాశ్చర్యము.

తా. సుందరమైన యధరముకల నప్పిన్నపిరాట్టిని పొందుటకై యేడువృషభములను సంహరించినవాఁడును రామావతారంబెత్తి రావణుని సంహరించినవాఁడును ఉత్తమకులమునందుఁ బుట్టి సర్వలక్షణసంపన్నమైన కువలయాపీడ మనియెడి మత్తగజమును బడగొట్టినవాఁడును నైన ఓ! శ్రియఃపతీ! ఆయాకాలముల

యందు నీకుఁ జేయతగిన కైంకర్యములను నేను చేయకున్నను నామనస్సును నీ దివ్య దేహమునకుఁ దగిన చందనముగ నంగీకరించితివి. ఇట్టి నీప్రణయమును నే నేమని చెప్పెద? ... ... ... ... ౧

పూశుమ్శాన్దెన్నెఞ్జమే పునైయుజ్జణ్ణియెనతుడైయ *
వాశకఞ్జెయ్మాలైయే వాపట్టాడైయుమంఃతే *
తేశమానవణికలనుమ్ ఎన్ కైకూప్పుచ్చెయ్కైయే *
ఈశన్ ఞాలముణ్డుమిళ్న్ద ఎన్దైయేకమూర్తిక్కే. ౨

ఈశన్ ఞాలముణ్డు. ఉమిళ్న్ద ఎన్దై ఏకమ్ మూర్తిక్కు, పూశుమ్ శాన్దు ఎన్నెఞ్జమ్ పునైయుమ్ కణ్ణి ఎనతుడైయ వాశకమ్ శెయ్ మాలై వాన్ పట్టాడైయుమ్ అంఃదే తేశమాన అణి కలనుమ్ ఎన్ కైకూప్పుచ్చెయ్కైయే.

నియామకుఁడును లోకములను ప్రళయ కాలమునందు మ్రింగియు మఱల బయలుపఱచి రక్షించినవాఁడును (ఇట్లు నన్ను వశపఱచుకొనిన) నాస్వామియు అద్వితీయమైన విగ్రహముకల వాఁడును నైన (భగవంతునికి) సమర్పింపఁదగిన చందనము నామనస్సగుచున్నది. ధరించుకొన తగిన మాల నాయొక్క శబ్దములచే చేయబడిన మాలగానున్నది. శ్లాఘ్యమైన వస్త్రమును ఆశబ్ద సందర్భమే తేజస్కరమగునట్లు ధరింపఁబడిన ఆభ రణములును నాయొక్క అంజలి చేయుటయే.

తా. ప్రళయకాలమునందు సకలలోకములను తన యుదరమునందుంచియు సృష్టికాలమునందు బయలుపఱచియు ఇట్లు సకల జగద్రక్షకుఁడైన శ్రియఃపతి తన దివ్యచేష్టితములచే నన్ను దాసునిగాఁ జేసుకొనెను. ఇట్టి యుపకారకునికి నాకరణవ్యాపారమగు స్మరణము చందనముగాను, నావార్తలు దివ్యపుష్ప మాలలుగాను, వస్త్రముగాను, నాయంజలి దివ్యాభరణములుగాను ఆయెను. ఇట్లు వాని ప్రేమ కార్యమును నేనేమని చెప్పెద? ... ... ౨

ఏకమూర్తియిరుమూర్తి మూన్రుమూర్తిపలమూర్తి
యాకి * ఐన్దుపూతమాయ్ ఇరణ్డుశుడరాయరువాకి *
నాకమేఱినడుక్కడలుళ్ తుయిన్ర నారాయణనే * ఉన్
ఆకముళ్ మునకత్తడక్కి ఆవియల్లల్ మాయ్ త్తతే. 3

ఏకమూర్తి ఇరుమూర్తి మూన్రుమూర్తి పలమూర్తి యాకి ఐన్దు పూతమాయ్ ఇరణ్డుశుడరాయ్ అరువాకి నాకమ్ ఏఱి నడుక్కడలుళ్ తుయిన్ర నారాయణనే ఉన్ ఆకమ్ ముழుమ్ అకత్తు అడక్కి ఆవి అల్లల్ మాయ్ త్తతే.

(సృష్టికిమునుపు) తానొక్కఁడును, (ప్రకృతి, మహత్, ఈ రెంటిని) శరీరములుగాఁ గలవాఁడును (సత్వము రజస్సు తమస్సు ఈ మూఁడుగుణము లను) ప్రకారములుగాఁ గలవాఁడును (అనేకము లను) ప్రకారములుగాఁ గలవాఁడును (పంచ భూతములను) ప్రకారములుగాఁ గలవాఁడును (సూర్యచంద్రులను) శరీరములుగాఁ గలవాఁడును సూక్ష్మశరీరము కలవాఁడును ఆదిశేషునిమీఁద ఎక్కి మధ్యసముద్రమునందు నిద్రించిన నారా యణ శబ్దవాచ్యుఁడా! నీయొక్క విగ్రహమును అంతటను నామనస్సునందు కబళీకరించి యనుభ వించి నాయాత్మ (క్రింది తిరువాయ్ మొழியందుఁ బడిన) దుఃఖమును బోఁగొట్టుకొనెను.

తా. సృష్టికిఁ బూర్వకాలమునందు తా నొకఁడును ప్రకృతిమహత్ వీటిని శరీరముగాఁగలవాఁడును సత్వరజస్తమస్సు లనియెడి గుణములను ప్రకారము లుగాఁ గలవాఁడును కరణములను పంచభూతములను ప్రకారములుగాఁ గల వాఁడును చంద్రసూర్యులను సృష్టించినవాఁడును ఇట్లు సకల జగత్సృష్టికర్తయు నైన ఓ! శ్రియఃపతీ! నాయాత్మ నిన్ను మనస్సునందుంచియు సంపూర్ణముగ ననుభవించియు పూర్వము జనించిన దుఃఖమును సవాసనముగఁ బోఁగొట్టు కొనెను. ... ... ... ... 3

4

మాయ్ త్తలెణ్ణివాయ్ ములై తన్ద మాయప్పేయుయిర్
మాయ్ త్త * ఆయమాయనే వామననేమాతవా *
పూ త్తణ్మాలై కొణ్డుఉన్నైప్పోతాల్ వణజ్గేనేలుమ్ * నిన
పూ త్తణ్మాలై నెడుముడిక్కు ప్పునైయుజ్గణ్ణిమెనతుయిరే. ౪

మాయ్ త్తల్ ఎణ్ణి వాయ్ ములై తన్ద మాయమ్ పేయ్ ఉయిర్ మాయ్ త్త ఆయ మాయనే వామననే మాతవా ఉన్నై పూ తణ్ మాలై కొణ్డు పోతు వణజ్గే నేలుమ్ నిన పూ తణ్ మాలై నెడుముడిక్కు పునైయుమ్ కణ్ణి ఎనతు ఉయిరే.

సంహరించుటను తలిచి నోటియందు స్తనమును ఉంచిన మోసకత్తెయైన పూతనయొక్క ప్రాణములను బోఁగొట్టిన గోపకులమునం దవతరించిన ఆశ్చర్యభూతుఁడా! వామనుఁడా! ఓ! శ్రియఃపతీ! నిన్ను పుష్పములతోఁగూడిన చల్లని మాలలను గొని ప్రాప్తకాలమునందు నమస్కరింపనివాఁడైనను నీయొక్క పుష్పమయములైన చల్లని మాలలచే నలంకృతమై పొడవైన కిరీటమునకు సమర్పించునట్టి పుష్పమాల నాయొక్క ప్రాణము లగుచున్న దే.

తా. మిక్కిలి మోసకత్తెయైన పూతన తల్లివలెవచ్చి విషదిగ్ధమైన స్తనమును తన నోటియందు వంచనతోనుంచఁగా నప్పుఁడా స్తనమునందున్న విషముతో నాపూతనయొక్క ప్రాణములను పానము జేసి దానిని సంహరించిన ఓ! రుక్మిణీపతీ! ప్రాప్తకాలములయందు నీ పాదారవిందములను నమస్కరించుట కిచ్చి పెట్టనివాఁడనైతిని. అయినను ఆధిరాజ్యసూచకమగు నీ దివ్యరత్నకిరీటమునం దలంకారార్థముగ సమర్పించునట్టి పుష్పమాల నాసత్తమాయెనే యిది యేమాశ్చర్యము? ... ... ... ... ౪

కణ్ణియెనతుయిర్ కాతల్ కనకచ్చోతిముడిముతలా *
ఎణ్ణిల్ పల్ కలన్గళుమ్ఏలుమాడైయుమఃతే *
నణ్ణిమూవులకుమ్ నవిఱ్ఱుమ్కీర్తియుమఃతే *
కణ్ణనెమ్బిరానెమ్మాన్ కాలశక్కరత్తానుక్కే. ౫

| | |
|---|---|
| కాలమ్ శక్కరత్తాణ్ ఎమ్మాణ్ ఎమ్బిరాణ్ కణ్ణనుక్కు ఎనతు ఉయిర్ కణ్ణి కాతల్ కనకమ్ శోతిముడి ముతలా ఎణ్ణిల్ పల్ కలన్గళుమ్ ఏలుమ్ ఆడైయుమ్ అంఃదే మూవులకుమ్ నణ్ణి నవిన్ఱుమ్ కీర్తియుమ్ అంఃదే. | కాలమున కాధారమైన చక్రమును ధరించినవాఁడును నాస్వామియు మహోపకారకుఁడును నైన కృష్ణునికి నాయొక్క ఆత్మవస్తువు మాల యగుచున్నది. ప్రేమ స్వర్ణమయమై యుజ్జ్వలమైన కిరీటము మొదలగు లెక్కపెట్టుట కశక్యములైన ఆభరణము లగుచున్నది. తగుమైన వస్త్రమును నదియే. మూఁడులోకములును సమీపించి స్తుతించుటకుఁ దగిన కీర్తియును ఆ ప్రేమయే. |

తా. శత్రు నిరసనస్వభావముకల చక్రాయుధమును ధరించియు తన దివ్య సౌందర్యమును నాకుఁ గనుపఱచియు నన్ను దాస్యమునందు గైకొనిన మహోపకారకుఁడు నాయాత్మవస్తువును తన శిరస్సుచే ధరింపఁదగిన మాలగా నంగీకరించెను. ఆత్మధర్మమైన నాప్రేమను దివ్యకిరీటము మొదలగు దివ్యాభరణములుగాను దివ్యపీతాంబరముగాను సకలలోకులును నాదరించి శ్లాఘించునట్టి కీర్తిగాను నంగీకరించెను. ఇట్లు నాయాత్మ మొదలగునవియే వానికి సర్వాభరణములాయెను. ... ... ... ... ౫

కాలశక్కరత్తొడు వెణ్ శఙ్గమ్కై యేన్దినాయ్ *
ఞాలముఱ్ ఱుముణ్డుమిழ் న్ద నారాయణనేయెన్ఱెన్ఱు *
ఓలమిట్టునాన్ అழైత్తాల్ ఒన్ఱుమ్వారాయాకిలుమ్ *
కోలమామెణ్ శెన్నిక్కు ఉన్ కమలమన్న కுరైకழలే. ౬

| | |
|---|---|
| కాలశక్కరత్తొడు వెణ్ శఙ్గు అమ్ కై ఏన్ది నాయ్ ఞాలమ్ ముఱ్ఱుమ్ ఉణ్డు ఉమిழ் న్ద నారాయణనే | (శత్రువులను సంహరించుటకు) యముఁడైన చక్రాయుధముతో తెల్లని పాంచజన్యమును సుందరములైన హస్తములయందు ధరించినవాఁడును భూమిని అంతటను భుజించి బయలు |

ఎన్ఱెన్ఱు ఓలమిట్టు నాన్ అళైత్తాల్ ఒన్ఱుమ్ వారాయాకిలుమ్ ఎన్ శెన్నిక్కు ఉన్ కమలమన్న కుఱైకళ్ఱల్ కోలమామ్.

పఱచినవాఁడును నైన ఓ! నారాయణుఁడా! అని పలుమా రనుసంధించి బొబ్బలిడి నేను పిలిచినను ఒకగురుతును లేకుండునట్లు రానివాఁడైనను నాశిరస్సుకు (శేషియైన) నీయొక్క కమలముల వలె మనోహరములై ధ్వనించుచున్న పాదములు అలంకారము లగుచున్నవి.

తా. విరోధి నిరసనస్వభావముకల చక్రాయుధమును శంఖమును సుందరములైన హస్తములయందు ధరించినవాఁడును చతుర్దశభువనములను ప్రళయకాలమునం దుదరమునందుంచి రక్షించియు సృష్టిసమయమునందుఁ ప్రకాశపఱచియు నిట్లు సర్వరక్షకుఁడును నైన నిన్ను ఓ! నారాయణుఁడా! యని నేపిలిచియు నీవు సేవసాదింపకున్నను దివ్యాభరణభూషితములైన నీ దివ్యపాదారవిందములే ధారక పోషక భోగ్యములై నాసత్తకుఁ గారణమగుచున్నవి. ... ౬

కుఱైకళ్ఱల్ కళ్ నీట్టిమణ్గొణ్డకోలవామనా *
కుఱైకళ్ఱల్ కై కూప్పువార్ కళ్ కూడనిన్ఱమాయనే *
విఱైకొళ్ పూవుమ్నీరుమ్కొణ్డేత్తమాట్టేనేలుమ్ * ఉన్
ఉఱైకొళ్ శోతిత్తిరువురువమ్ ఎన్నతావిమేలతే. ౭

కుఱైకళ్ఱల్ కళ్ నీట్టి మణ్ కొణ్డ కోలమ్ వామనా కుఱైకళ్ఱల్ కై కూప్పువార్ కళ్ కూడ నిన్ఱ మాయనే విఱైకొళ్ పూవ్రుమ్ నీరుమ్ కొణ్డు ఏత్తమాట్టే నేలుమ్ ఉఱై కొళ్ శోతి ఉన్ తిరు

ధ్వనించుచున్న పాదములను వృద్ధిపఱచి లోకములను గొలిచిన సుందరుఁడైన వామనావతారం బెత్తినవాఁడా! ధ్వనించుచున్న పాదములను ఉద్దేశించి అంజలిచేయువారు ఆశ్రయించునట్లు (ఉపాయోపేయములై) యున్న ఓ! ఆశ్చర్యభూతుఁడా! పరిమళముకల పుష్పములను (పాద్యము మొదలగు) తీర్థమును (ప్రేమతో) ధరించి స్తుతించుట కశక్తుఁడనైనను వేదాంతవచనము

ఉరువమ్ ఎన్న తావి మేలతు. లచే అపరిచ్ఛేద్యమైన తేజస్సుకల నీయొక్క దివ్య మంగళవిగ్రహము నాయాత్మను ఆధారముగాఁ గలదై యున్నది.

తా. వీర్యమునకు ప్రఖ్యాపకములైన పాదభూషణములచే శబ్దించుచున్న దివ్యపాదారవిందములచే చతుర్దశభువనములను గొలిచి వశపఱచుకొని యింద్రు నకు నుపకరించిన ఓ! వామనుఁడా! ఆ దివ్యపాదారవిందముల నుద్దేశించి యంజలిచేయువారలు తనను ఆశ్రయించునట్లు ఉపాయోపేయములుగా వేంచేసి యున్న ఓ! ఆశ్చర్యభూతుఁడా! ఇట్లు వేంచేసియున్నను పుష్పాద్యుపకరణము లను గొని కైంకర్యముచేయుట ప్రాప్తమైనను ఆ కైంకర్యమునుజేయ లభింపని వాఁడ నైతిని. ఇట్లు నే నశక్తుఁడనైనను నా యాత్మసత్తయే నీకు ధారకముగ నాయెనే యిది యేమాశ్చర్యము? ... ... ౭

ఎన్న తావిమేలైయాయ్ ఏర్ కొళ్ళేழులకముమ్ *
తున్నిముళ్ ఱుమాకినిన్ఱ శోతిఞానమూర్తియాయ్ *
ఉన్న తెన్న తావియుమ్ఎన్న తున్న తావియుమ్ *
ఇన్నవణ్ణమేనిన్ఱాయ్ ఎన్ఱురైక్క వల్లేనే. ౮

ఎన్న తావి మేలైయా య్ ఏర్ కొళ్ ఏழ్ ఉలక ముమ్ తున్ని ముళ్ ఱుమ్ ఆకి నిన్ఱ శోతి ఞానమ్ మూర్తి యాయ్ ఎన్న తావి ఉన్న తుమ్ ఉన్న తావి ఎన్నతుమ్ ఇన్నవణ్ణమే నిన్ఱాయ్ ఎన్ఱు

నాయాత్మయందభినివేశముకలవాఁడై ఔజ్జ్వల్యమును స్వభావముగాఁగల ఏడువిధము లైన లోకములయందు పూర్ణముగ వ్యాపించి సమస్తపదార్థములును తనకుఁ బ్రకారములగు నట్లు వేంచేసియున్న తేజస్స్వరూపమైన జ్ఞాన మును స్వరూపముగాఁ గలవాఁడా! నా యాత్మ స్వరూపము నీకు భోగ్యముగాను నీ దివ్యాత్మ స్వరూపము నాకు భోగ్యముగాను ఈప్రకార

ఉరైక్క-వల్లేనే. ముగా వేంచేసియుండువాఁడ నైతివి అని చెప్పుట కును అశక్తుఁడనైతిని.

తా. నాసత్తను లభించినందున ప్రీతిప్రకర్షము కలవాఁడా! సమస్తపదార్థములయందును పూర్ణముగ వ్యాపించిన నిరవధిక దివ్యజ్ఞానముకలవాఁడా! పరస్పర విశ్లేషమునందు సత్తనశించునట్లు జనించిన మన సంశ్లేషము వాచామగోచరమై యున్నది. ... ... ... ... ౮

ఉరైక్క-వల్లేనల్లేఁ ఉన్నులప్పిల్ కీర్త్తివెళ్ళత్తిఁ *
కరైక్క-ణ్ణెన్ఱు శెల్వాఁ నాఁ కాతల్ మైయలేఱినేఁ *
పురైప్పిలాతపరమ్బరనే పొయ్యిలాతపరఙ్జుడరే *
ఇరైత్తునల్లమేన్మక్క-ళేత్త యానుమేత్తినేఁ. ౯

ఉరైక్క-వల్లేఁ అల్లేఁ ఉలప్పు ఇల్ ఉఁ కీర్త్తి వెళ్ళత్తిఁ కరైక్కణ్ నాఁ ఎన్ఱు శెల్వాఁ కాతల్ మైయ లేఱినేఁ పురైప్పు ఇలాత పరమ్బరనే పొయ్ ఇలాత పరఙ్జుడరే! నల్ల మేల్ మక్కళ్ ఇరైత్తు ఏత్త యానుమ్ ఏత్తినేఁ.

(ఆశ్రితవిషయమున నీ ప్రణయమును) చెప్ప శక్తుఁడనుకాను. అంతము లేని నీయొక్క-కీర్త్తియనియెడి సముద్రముయొక్క- తీరమును నేను ఎన్నఁడు పొందగలను? ప్రేమచే కలతజెందిన వాఁడ నైతిని. దోషములేని పరులకుఁ బరుఁడా! అబద్ధములేని పరంజ్యోతిస్స్వరూపుఁడా! మంచి స్వభావముకలవారును సర్వోత్కృష్టులును నైన ప్రజలైన (నిత్యసూరులు) ఘోషించి స్తుతింపఁగా నేనును స్తోత్రముచేసితిని.

తా. ఆశ్రితులయందు నీకున్న ప్రణయిత్వగుణమును జెప్ప నశక్తుఁడనైన నేను అపరిచ్ఛేద్యమైన నీకీర్త్తియనియెడి మహార్ణవముయొక్క- తీరము నెన్నఁడు పొందగలను? నీకీర్త్తిని జెప్పుట కిట్లసమర్థుఁడనైనను ప్రేమాతిశయముచే నున్మత్తుఁడనై సర్వోత్కృష్టులును విలక్షణజ్ఞానాది దివ్యస్వభావము కలవారును

నైన నిత్యసూరులు నిన్ను స్తుతించుటంజూచి నేనును స్తుతించితిని గాన నీ ప్రణయిత్వప్రకర్షము నావార్తల కందనిదై యున్నది. ... ... ౯

యానుమేత్తి ఏழுలకుమ్ముఱ్ఱుమేత్తి * పిన్నైయుమ్
తానుమేత్తిలుమ్ తన్నైయేత్తవేత్తవెఙ్గెయ్ తుమ్ *
తేనుమ్పాలుమ్కన్నలుమ్ అముతుమాకిత్తిత్తిప్ప *
యానుమెమ్బిరానైయేయేత్తినేన్ యానుయ్ వానే. ౧౦

యానుమ్ ఏత్తి ముఱ్ఱుమ్ ఏழுలకుమ్ ఏత్తి పిన్నైయుమ్ తానుమ్ ఏత్తిలుమ్ తన్నై ఏత్తవేత్త ఎఙ్గు ఎయ్ తుమ్? తేనుమ్ పాలుమ్ కన్నలుమ్ అముతుమాకి తిత్తిప్ప ఎమ్ పిరానైయే యాన్ ఉయ్ వాన్ యానుమ్ ఏత్తినేన్.

(సంపూర్ణజ్ఞానముకల) నేనును స్తుతించి సమస్తములైన ఏడులోకములును స్తుతించి దానిపై (సర్వజ్ఞుఁడైన) తాను స్తుతించినను తనను స్తుతింపస్తుతింప ఎచ్చట ముగించును? తేనెను పాలును బెల్లపుగడ్డను అమృతమునువలె తీపుగనుండ నాయొక్క మహోపకారకునే నేను ఉజ్జీవించుటకై నేనును స్తోత్రముచేసితిని.

తా. సంశయవిపర్యయములు లేని జ్ఞానపూర్తికల నేనును బద్ధముక్త నిత్యులగు త్రివిధాత్మవర్గములును స్వతస్సర్వజ్ఞుఁడై సర్వశక్తుఁడైన తానును ఇట్లందరును నేకరీతిగ స్తుతించినను నపరిచ్ఛిన్నములైన నీకల్యాణగుణములు సర్వప్రకారములఁచేఁ భోగ్యములగునట్లు నా కనుభవింపఁజేసిన మహోపకారకుఁడైన నిన్నే నే నుజ్జీవించుటకై స్తుతించినవాఁడనైతిని. ... ... ౧౦

* ఉయ్ వుపాయమ్మఱ్ఱిన్నైమ్మతేఱి కణ్ణనొణ్కழల్ కళ్మేల్ *
శెయ్యతామరైప్పழన త్తెన్నన్గురుకూర్చ్చడకోపన్ *

పొయ్యిల్ పాడలాయిరత్తుళ్ ఇవై యుమ్పత్తుమ్‌వల్లార్ కళ్ *
వై యమ్మన్ని వీఱ్ఱిరున్దు విణ్ణుమాళ్వార్ మణ్ణూడే. ౧౧

ఉయ్ వుపాయమ్ మ ఱ్ఱిన్ఱి ఇవై్మ్యే తేఱి కణ్ణన్ ఒణ్ కళ్గల్ కళ్ మేల్ శెయ్యు తామరై పళ్గనమ్ తెన్నన్ కురుకూర్ శడకోపన్ పొయ్ ఇల్ పాడల్ ఆయిరత్తుళ్ ఇవై యుమ్‌పత్తుమ్ వల్లార్ కళ్ వై యమ్ మన్ని వీఱ్ఱిరున్దు మణ్ణూడే విణ్ణుమ్ ఆళ్వార్.

ఉజ్జీవనోపాయము ఇతరము లేకుండుటను నిశ్చయించి కృష్ణునియొక్క పరమభోగ్యములైన పాదములవిషయముగ ఎఱ్ఱని తామరపుష్పములు కల సరస్సులతోఁగూడిన దక్షిణదిక్కునందు శ్లాఘ్యమైన కురుకూరికి నిర్వాహకులైన ఆళ్వార్లు మిథ్య లేకుండునట్లు పాడిన వేయిపాశురములలో నీ పదిపాశురములను నర్థముతో ననుసంధించు వారు భూమియందు స్థిరులగునట్లు పూజ్యులై యుండి భూమితో పరమపదమును నిర్వ హింతురు.

తా. ప్రణయిత్వమునుదప్ప ఇతరమైన ఉజ్జీవనోపాయము లేదని చక్కగ నిశ్చయించిన యాళ్వార్లు ఆశ్రితులయందుఁ బ్రణయియైన భగవంతునియొక్క దివ్యపాదారవిందములను విషయీకరించి సాదించిన వేయిపాశురములలో నీ పది పాశురములను నర్థముతో ననుసంధించువారికి నీశ్వరునియొక్క యుభయవిభూతులును నియామ్యము లగును. ... ... ... ౧౧

చతుర్థశతకములో తృతీయదశకము ముగిసెను.

ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.

తిరువాయ్ మొழி – చతుర్థశతకములో

# చతుర్థదశకము — మణ్ణైయిరున్దు

* మణ్ణైయిరున్దుతుழாవి వామనన్ మణ్ణితువెన్నుమ్ *
విణ్ణైత్తొழுతవన్మేవు వైకున్దమెన్ఱుకై కాట్టుమ్ *
కణ్ణైయుణ్ణీర్ మల్ కనిన్ఱు కడల్వణ్ణనెన్నుమన్నే * ఎన్
పెణ్ణైప్పెరుమయల్ శెయ్ తార్కు ఎన్ శెయ్ కేన్ పెయ్ వళైయీరే. ౧

మణ్ణై ఇరున్దు తుழாవి ఇతు వామనన్ మణ్ ఎన్నుమ్; విణ్ణై తొழுతు అవన్ మేవు వైకున్దమ్ ఎన్ఱు కై కాట్టుమ్; ఉళ్ నీర్ కణ్ణై మల్ క నిన్ఱు కడల్ వణ్ణన్ ఎన్నుమ్; అన్నే ఎన్ పెణ్ణై పెరుమ్ మయల్ శెయ్ తార్ క్కు పెయ్ వళైయీరే! ఎన్ శెయ్ కేన్.

భూమియందు కూర్చుండి కలపెట్టి ఇది వామనావతారంబెత్తిన విష్ణువుయొక్క భూమి అని చెప్పును; ఆకాశమునుగుఱించి యంజలిచేసి వాఁడు నిత్యముగ వసించునట్టి వైకుంఠము అని చెప్పి హస్తముచేఁ జూపించును; లోపల కన్నీరు నేత్రములనుమించి కారునట్లు నిలిచి సముద్రము వలె శ్రమహారమైన స్వభావముకలవాఁడు అని చెప్పును; అమ్మా! నాయొక్క కుమార్తెకు నతిశయించిన పైత్యమునుఁ బుట్టించినవారికి చక్కగా ధరింపఁబడిన కంకణములుకలవారా! ఏమిచేసెద ?

తా. భూమినిజూచి ఇది త్రివిక్రమావతారంబెత్తిన విష్ణువుచేఁ గొలువఁబడినది యనియు, ఆకాశమునుజూచి ఇది విష్ణువు నిత్యవాసముచేయుచున్న వైకుంఠమనియు, శోకాతిశయముచేఁ గన్నీరు ధారధారగాఁ గారగా సముద్రమువలె శ్రమహారమైన విగ్రహముకలవాఁడా అనియు ననుసంధించుచున్న యీచిన్నది షణ్ము

5

చున్న పాటులనుజూచి యిదియేమని యడిగిన వారలకు నీమె దశను జెప్పుచు తల్లి సర్వేశ్వరుఁ డీమెకు నీప్రకారము నున్మాదమును బుట్టించెను, దీనికి నేనేమి పరిహారము చేసెదనని శోకించెను. ... ... ... ౧

పెయ్ వళై క్కై క్కళై క్కూప్పిప్పిరా కిడక్కుమ్ కడలెన్నుమ్ *
శెయ్యతోర్ ఞాయిఱ్ఱై క్కాట్టి చ్చిరీతరన్ మూర్త్తియీతెన్నుమ్ *
నైయుమ్ కణ్ణీర్ మల్కనిన్రు నారణనెన్నుమన్నే * ఎన్
తెయ్ వవురువిల్ శిఱుమాన్ శెయ్ కిన్ఱతొన్ఱఱియేనే. ౨

పెయ్ వళై క్కై కళై కూప్పి పిరాన్ కిడక్కుమ్ కడల్ ఎన్నుమ్; శెయ్యతు ఓర్ నాయిఱ్ఱై కాట్టి శిరీ తరన్ మూర్త్తి ఈతు ఎన్నుమ్; నైయుమ్; కణ్ణీర్ మల్క నిన్రు నారణన్ ఎన్నుమ్; అన్నే ఎన్ తెయ్ వవురువిల్ శిఱు మాన్ శెయ్ కిన్ఱతు ఒన్ఱు అఱియేన్.

పలుమారు ధరింపఁబడిన వలయములుకల హస్తములను అంజలిచేసి ఉపకారకుఁడైనవాఁడు శయనించియున్న సముద్రము అని యనుసంధించును; ఎఱ్ఱనికాంతిచే అద్వితీయుఁడైన సూర్యుని జూపి శ్రీధరుఁడు (వసించుచున్న) శరీరము ఇది అని యనుసంధించును; (ఇట్లు శరణ్యుఁడును నుపాస్యుఁడును నైన భగవంతుని సమీపించి యనుభవింప లభింపనందున) జిక్కిపోవును; కన్నీరు నిండునట్లు ఉండి నారాయణుఁడు అని యనుసంధించును; ఓ అమ్మా! నాయొక్క కాంతితోఁగూడిన శరీరముకలదై చిన్న లేడివంటి వయస్సుకలదైన యీమె చేయువాటిని నొకటియు నెఱుఁగలేను.

తా. కార్శ్యముచేఁ బలుమారు జారుచున్న వలయములుకల హస్తములచేఁ భగవంతుని నమస్కరించియు, రాత్రియందు సముద్రఘోషమును విని పరమోపకారకుఁడైన శ్రియఃపతి శయనించియుండు సముద్రమనియు, ఇట్లు రాత్రి యంత నిదుర లేక ఘోషయది గడచినప్పుడు సూర్యునిజూపి ఇది పిరాట్టితోఁ భగవం

తుఁడు వేంచేసియున్నవాని శరీరమనియు, ఇట్లు తల్లితండ్రులైనవారు సంశ్లేషించి యుండు నిది చూచి శైథిల్యమునొందియు నేత్రములయందుండి కన్నీళ్ళుకారఁగా ఓ నారాయణుఁడా! అనియును నీమె యనుసంధించుచున్నది. ఇట్లనుసంధింపఁగా నిత్యసూరులవలె నిరవధికశరీరకాంతికలదియు మిక్కిలి ముగ్ధురాలును నైన యీమెయొక్క కార్యమేదో? ఎట్లు నెరవేరబోవుచున్నదో? నా కొకటియు తెలియకున్నది. ... ... ... ... ౨

అఱియుమ్ శెన్దీయై త్తழுవి అచ్చుతనెన్నుమ్ మెయ్ వేవాళ్ *
ఎఱియుమ్ తణ్గాల్ తైత్తழுవి ఎన్నుడై కోవిన్దనెన్నుమ్ *
వెఱికొళ్ తుழாయ్ మలర్ నాఱుమ్ విన్నైయుడై యాట్టియేన్పెற్ఱ *
శెఱివళై మున్గైచ్చిఱుమాన్ శెయ్ గిన్ఱదెన్ కణ్ణుక్కొన్ఱే. 3

అఱియుమ్ శెమ్ తీయై త్తழுవి అచ్చుతన్ ఎన్నుమ్; మెయ్ వేవాళ్; ఎఱియుమ్ తణ్ కాల్ తైత్తழுవి ఎన్నుడై కోవిన్దన్ ఎన్నుమ్; వెఱి కొళ్ తుழாయ్ మలర్ నాఱుమ్; విన్నైయుడై యాట్టియేన్ పెற్ఱ శెఱివళై మున్గై శిఱుమాన్ శెయ్ కిన్ఱతు ఎన్ కణ్ణుక్కు ఒన్ఱే.

దహించునని ఎఱుఁగఁబడిన ఎఱ్ఱని అగ్నిని కౌగిలించుకొని (నన్ను) విడువనివాఁడు అని చెప్పును. శరీరము దహింపఁబడదు. విసురుచున్న చల్లని వాయువును (ప్రణయియని) కౌగిలించుకొని నాకు భవ్యుఁడై (అలభ్యలాభమని) పశువులను బొందినవాఁడు అని పలుకును; పరిమళించుచున్న తులసీదళములవలె (యీమె) పరిమళించును. మహాపాపిష్ఠురాలైన నేను కనినదై జారుచున్న వలయములుకల హస్తములుకలదియు చిన్న లేడివలె నున్నదియును నైన (యీమె) చేయువ్యాపారము నాయొక్క నేత్రములకు నొకటిగాఁ గనుపడుచున్నదా?

తా. జ్వలించుచున్న యగ్నినిజూచి నిరవధిక తేజోమయదివ్యశరీరుఁడైన భగవంతుఁడని తలచి యాలింగనముచేసికొని నీవు నన్ను విడువకున్నవాఁడుకదా

యని చెప్పుచున్నను నాయగ్నిచే దహింపఁబడనిదై యుండును. చల్లగా విసురు చున్న మందమారుతమును ప్రణయి యని తలచి కౌగలించుకొని నన్ను రక్షించు టకై వచ్చిన గోపాలుఁడా! యని చెప్పును. ఈమెయంచు తులసి పరిమళించుచు నుండును గాన నీమెయొక్క రీతిని నేనేమని చెప్పెద? అగ్ని దహింపనందున లౌకికు రాలనియు, మందమారుతమును కౌగిలించుకొనుటవలన సంశ్లేషము కలదియనియు ఈమెయందు తులసీపరిమళము విసురుచున్నందున విరహిణియనియు నిర్ణయింప నశక్యమై యున్నది. ... ... ... 3

ఒన్నియతిఙ్గళై క్కాట్టి ఒళిమణివణ్ణనేయెన్నుమ్ *
నిన్ఱకున్ఱత్తినై నోక్కి నెడుమాలేవా వెన్ఱుకూవుమ్ *
నన్ఱుపెయ్యుమ్మళైకాణిల్ నారణన్వన్దా నెన్ఱాలుమ్ *
ఎన్ఱినమైయల్గళ్ శెయ్దార్ ఎన్నుడైక్కోమళత్తైయే. ౪

ఒన్నియ తిఙ్గళై కాట్టి
ఒళి మణి వణ్ణనే ఎన్నుమ్;
నిన్ఱ కున్ఱత్తినై నోక్కి నెడు
మాలే వా ఎన్ఱు కూవుమ్;
నన్ఱు పెయ్యుమ్ మళై కాణిల్
నారణన్ వన్దాన్ ఎన్ఱు ఆలుమ్;
ఎన్నుడై కోమళత్తై ఎన్ఱు ఇన
మైయల్ కళ్ శెయ్ తార్.

పూర్ణుఁడైన చంద్రుని (సమీపమునం దున్నవారలకు) జూపి కాంతికల స్ఫటికమువంటి శరీరముకలవాఁడా! అని పలుకును; మునుపు నిలిచియున్న పర్వతమును జూచి దీర్ఘమైన స్నేహముఃకలవాఁడా! రమ్మ్మ అని పిలుచును; చక్కగ వర్షించునట్టి మేఘమును చూచినచో ఉదకమును వాసస్థానముగాఁగల నారాయణుఁడు వేంచేసెను అని ససంభ్రమవర్తనము జేయును; నాయొక్క మృదువైన స్వభావముకల కుమార్తెను ఈప్రకారములను జెప్పునట్లు ఇట్టి భ్రమలను జేసిరి.

తా. పూర్ణచంద్రునిజూచి వీఁడు స్ఫటికమణివంటి కాంతిగల భగవంతుఁడే యని సమీపస్థులకుఁ జూపును, ఇట్లుండగా నొకపర్వతము మునుపు నిలిచియున్నట్లు

కనుపడును. దానినిజూచి గొప్ప వ్యామోహముకలవాఁడా! నీ వెందులకు లజ్జించె దవు రమ్మనిపిలుచును; కాలమునందు మేఘము వర్షింపఁగా నామేఘమునుజూచి నారాయణుఁడు వచ్చెనని జెప్పుచు నెమళ్లాడునట్లు నర్తనము చేయుచుండును; మృదువైన శరీరముగల నాకుమాత్రైను సర్వేశ్వరుఁ డిట్లు భ్రమింపజేసెను. సంశ్లేషమునుగూడ సహింపజాలని యీమెను నీ విశ్లేషబాధను నెట్లు సహింపఁ జేసెనో? ... ... ... ... ౮

కోమళవాన్ కన్రైప్పుల్కి కోవిన్దన్మేయ్ త్తనవెన్నుమ్ *
పోమిళనాకత్తిన్ పిన్పోయ్ అవన్ కిడక్కైయీదెన్నుమ్ *
ఆమళవొన్ఱుమఱియేన్ అరువినైయాట్టియేన్పెత్ర *
కోమళవల్లియైమాయోన్ మాల్ శెయ్దు శెయ్గిన్ఱకూత్తే. ౯

కోమళమ్ వాన్ కన్రై పుల్కి కోవిన్దన్ మేయ్ త్తన ఎన్నుమ్; పోమ్ ఇళమ్ నాకత్తిన్ పిన్ పోయ్ అవన్ కిడక్కై ఈతు ఎన్నుమ్; అరు వినై యాట్టియేన్ పెత్ర కోమళమ్ వల్లియై మాయోన్ మాల్ శెయ్తు శెయ్కిన్ఱ కూత్తు ఆమళవు ఒన్ఱుమ్ అఱియేన్.

(వయస్సుచే) చిన్నవియై (శరీరములచే) గొప్పవైన ఆవుదూడలను కౌగిలించుకొని (అలభ్య లాభమని తలఁచి) గోవులను బొందిన కృష్ణుఁడు మేపునవి అని పలుకును; సంచరించుచుండు చిన్న సర్పమునకు వెనుక వెళ్ళి ఆభగవంతుఁడు శయనించు శయనము ఇది అని చెప్పును; నశింపఁ జేయుట కశక్యమైన పాపములుకల నేను కని నదియు మృదుస్వభావము కలదియు తీగెవంటిదియు నైన యీమెను ఆశ్చర్యగుణచేష్టితములు కల వాఁడు భ్రమనుబుట్టించి చేయుచున్న ఆటలు ఎంతమాత్రమగునో యని ఒకటియు నేనెఱుఁగని దానసైతిని.

తా. భగవంతునియొక్క రక్షణప్రవృత్తిని ననుసంధించి యీమె ఆవుదూడ లనుజూచి వాఁడు రక్షించినవి యనియు సర్పమునుజూచి రక్షణార్థముగ నిత్య

విభూతినుండి వేంచేసి శయనించు శయనమనియు ననుసంధించుచున్నది. ఈమె కీమతివిభ్రమ మేమై ముగించునో నే నెఱుఁగలేను. ... ౫

కూ_త్తర్ కుడమెడుత్తాడిల్ గోవిన్దనామెనావోడుమ్ *
వాయ్_త్తకుఝలోశై కేట్కిల్ మాయవనెన్రుమైయాక్కుమ్ *
ఆయ్ చ్చియర్ వెణ్ణెయ్ కళ్ కాణిల్ అవనుణ్డ వెణ్ణెయీదెన్నుమ్ *
పేయ్ చ్చిములై శువైత్తార్కు ఎన్ పెణ్గొడియేఱియపిత్తే. ౬

కూ_త్తర్ కుడమ్ ఎడుత్తు ఆడిల్ గోవిన్దన్ ఆమ్ ఎనా ఓడుమ్; వాయ్_త్త కుఝలోశై కేట్కిల్ మాయవన్ ఎన్రు మైయాక్కుమ్; ఆయ్ చ్చియర్ వెణ్ణెయ్ కళ్ కాణిల్ అవన్ ఉణ్డ వెణ్ణెయ్ ఈతు ఎన్నుమ్; పేయ్ చ్చి ములై శువైత్తార్ కు కొడి ఎన్ పెణ్ ఏఱియ పిత్తు.

నర్తనముచేయువారు కుంభముల నెత్తి ఆడినచో గోవులసమృద్ధికల (కృష్ణుఁడు) కావచ్చును అని (చూచుటకై) పఱుఁగెత్తును; మనోహరమైన వేణునాదమును వినినచో ఆశ్చర్యభూతుఁడైన కృష్ణుఁడు అని మోహించుచుండును; గోపస్త్రీలయొక్క (హస్తములయందు) నవనీతమును చూచినచో ఆకృష్ణుఁడు ఆరగించిన వెన్నతో సజాతీయమైన వెన్న ఇది అని చెప్పును; పూతనయొక్క స్తనమును పానముచేసినవారికి తీగెవంటి శరీరముకల నా కుమార్తె పూర్ణముగఁ బొందిన పైత్య మీరీతిగనున్నది.

తా. నాకుమార్తె గొల్లలు కుంభనర్తనముచేయగా నదిచూచి నర్తనము చేయువాఁడు గోసమృద్ధికల కృష్ణుఁడుగ నుండవలయునని పరుగెత్తును; వేణుగానము వినబడినచో గోపయువతులయొక్క కోపమును బోఁగొట్టుటకై యాశ్చర్యభూతుఁడైన కృష్ణుఁడు వేణుగానము చేయుచున్నాడని మోహించును; గోపస్త్రీలయొక్క హస్తములయందు వెన్ననుజూచినచో ఆకృష్ణుఁ డారగించి శేషించిన వెన్న యిదియని యనుసంధించును; ఇట్లు కృష్ణవిషయమున నీమె యున్మత్తురా

లగుటకు నిదానము వీఁడు పూతనయొక్క స్తన్యమును పానముచేయు వ్యాజముచే విరోధి నిరసనముచేసి లోకులకు తననిచ్చి యుపకరించిన యుపకార మేకదా?

ఏఱియపి త్తినోడు ఎల్లావులకుకణ్ణ పడై ప్పెన్నుమ్ *
నీఱు శెవ్వేయిడక్కాణిల్ నెడుమాలడియారెన్ఱోడుమ్ *
నాఱుతుழాయ్ మలర్ కాణిల్ నారణన్ కణ్ణియీదెన్నుమ్ *
తేఱియుమ్ తేఱాదుమాయోన్ తిఱత్తినళేయి త్తిరువే. 2

ఏఱియ పి త్తినోడు ఎల్లా వులకు కణ్ణ పడై ప్పు ఎన్నుమ్: నీఱు శెవ్వే ఇడ కాణిల్ నెడుమాల్ అడి యార్ ఎన్ఱు ఓడుమ్ నాఱు తుழాయ్ మలర్ కాణిల్ నారణన్ కణ్ణి ఈతు ఎన్నుమ్; తేఱియుమ్ తేఱాదుమ్ ఇ త్తిరు మాయోన్ తిఱత్తనళ్.

మించిన భ్రమతోనుండగా సర్వలోకములును కృష్ణునియొక్క సృష్టి అని చెప్పును; భస్మము నూర్ధ్వముగ ధరింపఁగా చూచినదైనచో (ఆశ్రితులయందు) గొప్ప వ్యామోహముకల సర్వేశ్వరునియొక్క దాసభూతులు అని తలచి (వారిని గుఱించి) పరుగెత్తును; పరిమళించుచున్న తులసియొక్క పుష్పమాలలను జూచినచో నారాయణునియొక్క మాలలు ఇవి అని యనుసంధించును; (ఇట్లు) ధైర్యమును నొందినపుడును కలతజెందినపుడును ఈపిరాట్టి ఆశ్చర్యభూతునియొక్క విషయమునం దవగాహించుచున్నది.

తా. మిఱిమించిన భ్రమతో నుండునపుడును నీమె సమస్తలోకములును కృష్ణునియొద్దనుండి యుత్పన్నములాయెననియు, భస్మమునునైన ఊర్ధ్వముగాఁ ధరించినవారిని జూచినచో విష్ణుభక్తులని తలచి వారినిగుఱించి పరుగెత్తియు, దివ్యపరిమళముతోఁగూడిన తులసీమాలలను జూచినచో యివి సర్వజగద్రక్షకుఁడైన నారాయణునియొక్క మాలలనియు ననుసంధించియు నిట్లు ఆశ్చర్యగుణచేష్టితములుకల సర్వేశ్వరుని విషయమున వ్యామోహము నొందియున్న యీామె నిత్యానపాయినియైన శ్రీదేవితో వికల్పింపఁదగియున్నది. ... 2

తిరువుడై మన్నరై క్కాణిల్ తిరుమాలై క్కణ్డేనేయెన్నుమ్ *
ఉరువుడై వణ్ణఙ్గళ్ కాణిల్ ఉలగళన్దా నెన్రుతుళ్ళుమ్ *
కరువుడై త్తేవిల్ కళెల్లామ్ కడల్వణ్ణనో్కోయిలేయెన్నుమ్ *
వెరువిలుమ్వీఙ్గిలుమోవా క్కణ్ణకళ్గళ్ విరుమ్బుమే. ౮

తిరు ఉడై మన్నరై కాణిల్ తిరుమాలై కణ్డేనే ఎన్నుమ్; ఉరు ఉడై వణ్ణఙ్గళ్ కాణిల్ ఉలకళన్దాౕ ఎన్రు తుళ్ళుమ్; కరు ఉడై తేవిల్ కళ్ ఎల్లామ్ కడల్ వణ్ణౕ కోయిలే ఎన్నుమ్; వెరువిలుమ్ వీఙ్గిలుమ్ ఓవా కణ్ణౕ కళ్గళ్ విరుమ్బుమ్.

ఐశ్వర్యముకల రాజులను చూచినచో శ్రియఃపతిని సాక్షాత్కరించినదాననైతిని అని చెప్పును; రూపముగల పదార్థములను జూచినచో లోకములను గొల్చినవాఁడు అని సంభ్రమముతో నాడును; దేవతలను గల దేవతాలయములన్నియు సముద్రమువలె సుందరమైన శరీరముకల సర్వేశ్వరునియొక్క సన్నిధులే అని చెప్పును; (బంధువులనుజూచి) లజ్జించినప్పుఁడును మోహించినప్పుఁడును నిరంతరముగ కృష్ణునియొక్క పాదములను గోరుచునేయున్నది.

తా. సంపూర్ణమైన యైశ్వర్యముకలవారిని జూచినచో యామె యాశ్రితులయందలి వ్యామోహముకల సర్వేశ్వరుని సాక్షాత్కరించితిని యని యానందించును; నీలమణి సముద్రము నల్లకలువలు కాచపుష్పములు మొదలగు సదృశ పదార్థములను జూచినచో త్రివిక్రమావతారంబెత్తి లోకములనుగొల్చిన సర్వేశ్వరుఁడని ససంభ్రమనర్తనము చేయును. ఇతరదేవతలయొక్క ఆలయములను జూచినచో యివి శ్రియఃపతియొక్క సన్నిధియని యనుసంధించును. ఇట్లు మిక్కిలి విరహదుర్దశ విశేషించియున్నను సర్వేశ్వరునియం దాసక్తశాలైయున్నది. ... ... ... ... ౮

విరుమ్బిప్పగవరై క్కాణిల్ వియలిడముణ్డానేయెన్నుమ్ *
కరుమ్బెరుమేకఙ్గళ్ కాణిల్ కణ్ణనెన్రేఅప్పఱక్కుమ్ *

పెరుమ్బులవానిరై కాణిల్ పిరానుళ నెన్రుపిన్ శెల్లుమ్ *
అరుమ్ పెఱల్ పెణ్ణినై మాయోన్ అలర్ విళియయర్విక్కిన్రానే. ౯

పళవర్ రై కాణిల్ విరువిబ్బు వియల్ ఇడమ్ ఉణ్డానే ఎన్నుమ్; కరుమ్ పెరు మేకజ్గళ్ కాణిల్ కణ్ణన్ ఎన్రు ఏఱ పఱక్కుమ్; పెరుమ్ పులమ్ ఆనిరై కాణిల్ పిరాన్ ఉళన్ ఎన్రు పిన్ శెల్లుమ్ అరుమ్ పెఱల్ పెణ్ణినై మాయోన్ అలర్ విళి అయర్ప్పిక్కిన్రాన్.

జ్ఞానము మొదలగు గుణములచేఁ బూర్ణులైనవారిని జూచినచో ఆశించి విస్తీర్ణమైన జగత్తును మ్రింగి రక్షించినవాఁడా! అని యనుసంధించును; నల్లనివియు గొప్పవియు నైన మేఘములను జూచినచో కృష్ణుఁడు అని అచ్చటికి వెళ్లుటకు పదరుచుండును; గొప్పదియు దర్శనీయమును నైన పశువులగుంపును చూచినచో ఉపకారకుఁడు ఉపకరించుటకై యనుసరించుచున్నాడు అని వాని వెనుక వెళ్ళును; పొందుటకు దుర్లభమైన కొమార్తెను ఆశ్చర్యభూతుఁడు ప్రలాపించునట్లును చేసి మోహించినట్లును చేయుచున్నాడు.

తా. జ్ఞానాదిసద్గుణములచేఁ బూర్ణులైన సన్న్యాసులను జూచినచో సకల జగత్తులను ప్రళయకాలమునందు మ్రింగి యుదరమునం దుంచియు సృష్టికాలమునందు సృష్టించియు నిట్లు రక్షించిన సర్వేశ్వరుఁడు – ఇది నిశ్చితము అని సాధించును; వర్షాకాలమేఘమును జూచినచో ఆ మేఘములవలె ప్రణయరసమును ప్రవహించుచున్న కృష్ణుఁడని తలఁచి యచ్చటికి వెళ్లవలయునని యపేక్షించును; పశువులగుంపును జూచినచో వీటియందుఁ బ్రీతికలవాఁడగుటవలన యిచ్చట వాఁడుండ వచ్చునని వాటిని ననుసరించును; దుర్లభురాలైన నాకొమార్తెను భగవంతుఁడు తన దివ్యచేష్టితాదులచే నిట్లు చెప్పునట్లును మోహించునట్లును చేయుచున్నాడు. ... ... ... ... ౯

అయర్కుమ్ శుఱ్ఱముమ్ పఱ్ఱినోక్కుమ్ అగలవేనోక్కుక్కొళ్ళుమ్ *
వియర్కుమ్మళైక్కణ్ తుళుమ్బ వెవ్వుయిర్ కొళ్ళుమ్ మెయ్ శోరుమ్ *

పెయర్ త్తుమ్ కణ్ణా వెన్ఱు పేశుమ్ పెరుమానేవా వెన్ఱుకూవుమ్ *
మయల్ పెరుఙ్కాదలెన్ పేదైక్కు ఎన్ శెయ్ గేన్వల్వినై యేనే. ౧౦

అయర్ క్కుమ్ శుఴ్ ఱుమ్ పఴ్ ఱినోక్కుమ్ అకల నీణోక్కుక్కొళ్ళుమ్ వియర్ క్కుమ్ మృత్తై కణ్ తుళుమ్బ వెమ్ ఉయిర్ క్కొళ్ళుమ్ మెయ్ శోరుమ్; పెయర్ త్తుమ్ కణ్ణా ఎన్ఱు పేశుమ్; పెరుమానే వా ఎన్ఱు కూవుమ్; మయల్ పెరుమ్ కాతల్ ఎన్ పేతైక్కు వల్వినై యేన్ ఎన్ శెయ్ కేన్.

మోహించుచుండును నాలుగుప్రక్కలును; పలుమారు చూచుచునుండును; (చూపును) దూరమునందుంచి చిరకాలము చూచుచుండును; (శ్రమచే) చెమటతో నుండును; వర్షమువలె (స్రవించుచున్న కన్నీరు) నేత్రములలో తేలు నట్లును తాపము తోచునట్లును నిట్టూర్పులిడును; శరీరము శోషించును; మఱియు కృష్ణుఁడా! అని చెప్పును; నానాథుఁడా! రారాదా? అని పిలుచు చుండును; భ్రమ వృద్ధినొందునట్లు గొప్ప ప్రేమ కల నాయొక్క బాలికకు బలిష్ఠములైన పాప ములుకల నేను ఏమిచేయగలను?

తా. నేను చెప్పెడుమాటలను వినుటకుఁగూడ క్షమలేని నాబాలిక ఉన్న ట్లుండి చింతనుచాలించుకొని మోహించును; ఆమోహము తీరినపుడు సర్వేశ్వ రుఁడు వేంచేసిన ట్లధ్యవసించి చుట్టు నాల్గుప్రక్కలు చూచును. అచ్చట కనుబడ నందున వానిని చక్కగాఁ జూచుటకై తెప్పపాటునులేకయే నేత్రములను విస్తీర్ణ ముగఁ దెరిచి పరమపదమువఱకు చూచుచుండును; అచ్చటను కనుబడనందున ప్రణయరోషముచేఁ జెమట ధారధారగాఁ గారునట్లు శ్రమనొందును. నేత్రము లలోఁ గన్నీరు పూర్ణమై తేలునట్లు దుఃఖాతిశయముచే నిట్టూర్పులిడును. ఇ ట్లత్యంత పరితాపముచే శరీరముధరింప నశక్తురాలై మిక్కిలి కృశించును; మఱియు కృష్ణుఁడా! అని యార్తితో సంబోధించి నీ విచ్చటికి వేంచేయరాదా! అని గొప్పధ్వనితోఁ బిలుచును; ఇట్లు సదృశపదార్థములను ననుసంధించుటకును క్షమలేని వ్యసనాతిశయముచే నీమెకుఁబుట్టిన వికృతికి నేనేమి పరిహారముచేయ గలను? యీామె మోహింపకుండునట్లు చేసెదనా? నేనీ దుఃఖమును నోర్చు చుందునా? ... ... ... ... ౧౦

* వల్వినై తీర్క్కజ్కణ్ణనై వణ్ కురుగూర్ చ్చడకోపన్ *
శొల్వినై యాల్ శొన్న పాడల్ ఆయిరత్తుళ్ళివై పత్తుమ్ *
నల్వినై యెన్ఱుకత్పార్ కళ్ నలనుడై వైగున్దమ్ నణ్ణి *
తొల్వినై తీర వెల్లారుమ్ తొழுదెழுవిన్ ఇరుప్పారే. ౧౧

వల్ వినై తీర్క్కుమ్ కణ్ణనై వణ్ కురుకూర్ శడ కోపన్ శొల్ వినై యాల్ శొన్న పాడల్ ఆయిరత్తుళ్ ఇవై పత్తుమ్ నల్వినై ఎన్ఱు కత్పార్ కళ్ నలన్ ఉడై వైకున్దమ్ నణ్ణి తొల్ వినై తీర ఎల్లారుమ్ తొழுతు ఎழு వీన్ ఱు ఇరుప్పార్.

బలిష్ఠములైన పాపములను బోఁగొట్టునట్టి స్వభావముకల కృష్ణుని సంపదలచే సమృద్ధమైన తిరునగరికి నిర్వాహకులైన ఆళ్వార్ల వాచిక కైంకర్యరూపముచే సాధించిన గానరూపములగు పాశురములు వేయింటిలో నీపదిపాశురములను విలక్షణులయొక్క వ్యాపారములు అని తలఁచి అభ్యసించువారు (భగవదనుభవరూపమైన) ఆనందము కల పరమపదమును బొంది అనాదిసిద్ధమైన దోషములు తొలఁగునట్లు నిత్యసూరులందరును నమస్కరించి ఆదరించునట్లు వైలక్షణ్యముతో నుందురు.

తా. భగవదనుభవమునకు ప్రతిబంధకములైన క్రూరపాపములను నాశ్రితులకు సవాసనముగఁ బోఁగొట్టు సత్స్వభావముకల కృష్ణుని నుద్దేశించి యాళ్వార్ల వాచికకైంకర్యరూపముగా సమర్పించిన వేయిపాశురములలో నీ పదిపాశురములను ''ఇవి విలక్షణులు సాధించినవి'' యని ప్రేమతో ననుసంధించువారు పరమపదమును బొందునపుడు నిత్యసూరులు నమస్కరించి యాదరించునట్లు విలక్షణులై యుందురు. ... ... ... ౧౧

చతుర్థశతకములో చతుర్థదశకము ముగిసెను.

ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడిగళే శరణమ్.

---

తిరువాయ్ మొழி - చతుర్థశతకములో

# పంచమదశకము — వీఱ్ఱిరుస్దు

* వీఱ్ఱిరున్దేழுలకుమ్ తనిక్కోల్ శెల్ల వీవిల్ శీర్ *

ఆఱ్ఱల్ మిక్కాళుమమ్మానై వెమ్మాపిళన్దాతనై *

పోఱ్ఱియెన్నైకళార త్తొழுతుశొల్మాలైగళ్ *

ఏఱ్ఱనోఱ్ఱేఱ్కు ఇనియెన్నకుఱై యెழுమైయుమే. ౧

వీఱ్ఱు ఇరున్దు ఏழுల కుమ్ తని కోల్ శెల్ల, వీవిల్ శీర్ ఆఱ్ఱల్ మిక్కు ఆళుమ్ అమ్మానై వెమ్ మా పిళన్దా న్ఱనై పోఱ్ఱియెన్నైకై కళ్ ఆర తొழுతు శొల్ మాలైకళ్ ఏఱ్ఱ నోఱ్ఱేఱ్కు ఇని ఎழுమైయుమ్ ఎన్నకుఱై.

(సకల కల్యాణగుణములచే) విలక్షణుఁడై (నిత్యవిభూతియందు) వేంచేసియుండి ఏడులోకములయందు అద్వితీయమైన ఆజ్ఞ జరుగునట్లు అప్రతిహతమైన కల్యాణగుణములు కలవాఁడగుచు శాంతిచే నధికుఁడై పాలించుచున్న సర్వస్వామియు క్రౌర్యముకల (కేశియనియెడి) గుఱ్ఱమును జీల్చిన సర్వేశ్వరుని వృద్ధినొందుమా యని మంగళాశాసనము చేయుచునే హస్తములు తృప్తినొందునట్లు నమస్కరించి సూక్తులనియెడి మాలికలను సమర్పించుటకై పుణ్యముచేసిన నాకు ఇకమీఁద సప్తజన్మములయందును ఏమికొఱతలు కలవు?

తా. చతుర్దశభువనములయందును నప్రతిహతమైన యాజ్ఞకల సర్వేశ్వరుఁడు ఆశ్రితసంరక్షణార్థముగ నీ లీలావిభూతియందు మనుష్యసజాతీయుఁడై యవతరించెను. ఇట్లవతరించి యాశ్రితవిరోధిని రసనముచేసిన కృష్ణునిగుఱించి కవిత్వము చెప్పుటకు భాగ్యముచేసిన నాకికమీఁద ఎల్లప్పుడును నేమి కొఱతలున్నవి? ఏమియును లేవు. ... ... ... ... ౧

మైయకణ్ణాళ్ మలర్మేలుఱై వాళ్ ఉఱైమార్ పిన్న *
శెయ్యకోల త్తడఙ్కణ్ణన్ విణ్ణోర్ పెరుమానైత్తనై ౨ *
మొయ్యశొల్లాలిశై మాలైగళేత్తి ఉళ్ళప్పెఱ్ఱేన్ *
వెయ్యనోయ్గళ్ ముழுదుమ్ వియన్ఞాలత్తువీయవే. ౨

మైయ కణ్ణాళ్ మల ర్మేలుఱై వాళ్ ఉఱై మార్ పిన్న శెయ్య కోలమ్ తడమ్ కణ్ణన్ విణ్ణోర్ పెరుమా న్తనై౨ మొయ్య శొల్లాల్ ఇశై మాలైకళ్ వియల్ ఞాలత్తు వెయ్య నోయ్కళ్ ముழுతుమ్ వీయ ఏత్తి ఉళ్ల పెఱ్ఱేన్.

కాటుకపూసికొనునట్లు (నల్లని) నేత్రములుకలదియు తామరపుష్పములమీఁద వాసము చేయుచున్నదియు నైన లక్ష్మీ నిత్యవాసము చేయుచున్న వక్షస్థలముకలవాఁడును ఎఱ్ఱనివియు సౌందర్యముకలవియు విస్తీర్ణములును నైన నేత్రములుగలవాఁడును నిత్యసూరులకు నిర్వాహకుఁడును నైన సర్వేశ్వరుని లక్షణములచేఁ బూర్ణములైన సూక్తులచే నమఱియు గానముతోఁగూడిన మాలికలచే విస్తీర్ణమైన భూమియందుండునపుడు పరితాపహేతువైన వ్యాధులన్నియు నశించునట్లు స్తుతించి మనస్సుచే ననుభవించునట్లు లభించితిని.

తా. సర్వకాలములయందును కాటుకతోఁ గూడినట్లు అసితములై మనోహరములైన నేత్రములుకలదియు తామరపుష్పమునందుఁ బుట్టి దానియందు వసించుచునుండిన శ్రీమహాలక్ష్మి యత్యాశతో నిత్యవాసముచేయుచున్న విశాల వక్షస్థలముకలవాఁడును ఎఱ్ఱని దివ్యనేత్రములు కలవాఁడును నిత్యసూరి నిర్వాహకుఁడును నైన సర్వేశ్వరు నుద్దేశించి సర్వలక్షణసంపన్నములైన శబ్దసందర్భములనియెడి పుష్పమాలికలచే నాయొక్క యవిద్యాకర్మవాసనారుచి ప్రకృతిసంబంధములనియెడి సమస్తవిరోధులును నీభూమియందు సంచరింపక సమూలముగ నశించునట్లు పూజించి యనుభవించునట్లు భాగ్యవంతుఁడనైతిని. ... ౨

వీవిలిన్బమ్మిగ ఎల్లైనిగఴ్న్దనమ్మచ్చుతఀ *
వీవిల్ శీరన్మలర్ కణ్ణఀ విణ్ణోర్ పెరుమాఀతనై ఌ *
వీవిల్ కాలమిశై మాలై గళేత్తి మేవప్పెఱ్ఱేఀ *
వీవిలిన్బమ్మిగ ఎల్లైనిగఴ్న్దనన్మేవియే. 3

వీవిల్ ఇన్బమ్ మిక ఎల్లైనికఴ్న్ద నమ్ అచ్చుతఀ వీవిల్ శీరఀ మలర్ కణ్ణఀ విణ్ణోర్ పెరుమాన్ఱనై ఌ వీవు ఇల్ కాలమ్ ఇశై మాలై కళ్ ఏత్తి మేవప్పెఱ్ఱేఀ; మేవి వీవిల్ ఇన్బఀ మిక వెల్లై నికఴ్న్దనఀ.

అవిచ్ఛిన్నమైన ఆనందము మేలైన అవధి యందు వర్తించుచున్న (ఆకారమును) మనబోటి వారలకు (అనుభవపటిచెడి) సంకోచములేని స్వభావముకలవాఀడును అవధిలేని కల్యాణగుణములు కలవాఀడును తామరపుష్పములవంటి నేత్రములుకలవాఀడును నిత్యసూరులకు ప్రధానపురుషుఀడును నైన సర్వేశ్వరుని అంతములేని కాలమంతయు గానరూపములైన శబ్దసందర్భములచే స్తుతించి ఆశ్రయింప లభించితిని; ఆశ్రయించి అంతములేని ఆనందముయొక్క అపరిచ్ఛేద్యమైన యభివృద్ధులు కలిగినవి.

తా. నిరవధికమైన అపరిచ్ఛిన్నానందమును నావంటివారి ననుభవింపఀజేసినవాఀడును అసంకుశస్వభావుఀడును అపరిమితములైన నిత్యకల్యాణగుణములు కలవాఀడును నిత్యసూరి నిర్వాహకుఀడును నైన శ్రీవైకుంఠనాథుని శబ్దసందర్భములనియెడి పుష్పమాలికలచే ననవరత మారాధించి యనుభవింప లభించితిని. ఇట్లు సమీపించినఀదున వాని యానందమును కబళీకరించునట్టి యపరిమితమైన యానందము నొందువాఀడనైతిని. ... ... ... 3

మేవినిన్ఱుతొఴువార్ వినై పోగ మేవుమ్పిరాఀ *
తూవియమ్పుళ్ళుడైయాఀ అడలాఴియమ్మాఀతనై ఌ *

నావియలాలిశై మాలైగళేత్తి నణ్ణప్పెత్ఱేన్ *
ఆవియెన్నావియై యానఱియేన్ శెయ్దవాఱ్ఱైయే. ౮

మేవి నిన్ఱు తొழுవార్ వినై పోక మేవుమ్ పిరాన్ తూవి అమ్ పుళ్ ఉడైయాన్ ఆడల్ ఆழி అమ్మానై నా ఇయలాల్ ఇశై మాలైకళ్ ఏత్తి నణ్ణ పెత్ఱేన్ ఆవి ఎన్ ఆవియై శెయ్త ఆఱ్ఱై యాన్ అఱియేన్.

(అనన్యప్రయోజనులై) కలిసి స్థిరముగ నుండి నమస్కరించువారలయొక్క పాపములు నశించునట్లు సంశ్లేషించు మహోపకారకుఁడును ఱెక్కలును సౌందర్యమును కల గరుత్మంతుని వాహనముగాఁగలవాడును యుద్ధోన్ముఖమైన చక్రాయుధము కలవాఁడును నైన సర్వేశ్వరుని నాలుకయొక్క వ్యాపారములచేఁ గానరూపము లైన శబ్దసందర్భములను జెప్పి స్తుతించుట యని యెడి అనుభవమును బొందితిని. ఆత్మభూతుఁడైన సర్వేశ్వరుఁడు నాయొక్క ఆత్మను చేసినప్రకార ములను నేను (పరిచ్ఛేదించి) ఎఱుఁగలేను.

తా. అనన్యప్రయోజనులై దృఢాధ్యవసాయముతో నాశ్రయించువారల యొక్క భగవదనుభవవిరోధులగు పాపములైన యవిద్యాకర్మవాసనారుచి ప్రకృతి సంబంధములను సవాసనముగ నశింపఁజేయుటకై వారితో సంశ్లేషించు మహోప కారకుఁడును గరుడవాహనుఁడును నైన సర్వేశ్వరుఁడు యుద్ధోన్ముఖమైన చక్రా యుధమును చేతియందు ధరించి తన సౌందర్యమును నాకుఁ గనుపఱచుటకై వేంచేసినవానిని పలుమారు స్తుతించి యనుభవించితిని. నాయాత్మకు ధారకుఁడైన సర్వేశ్వరుఁడు అత్యంతనీచుఁడైన నన్ను జేసిన ప్రకారములు వాచామగోచరము లైయున్నవి. ... ... ... ... ౮

ఆఱ్ఱనల్లవగై కాట్టుమ్ అమ్మానై * అమరర్ తమ్
ఏఱ్ఱై ఎల్లాప్పొరుళుమ్విరిత్తానై యెమ్మానై తన్నై *

మాఱ్ఱమాలై పునైన్దేత్తి నాళుమ్మగిళ్ఙ్వెయ్ దినే *
కాఱ్ఱిన్మున్నమ్కడుగి విసై నోయ్ గళ్ కరియవే. ౫

ఆఱ్ఱ నల్ల వకై కాట్టుమ్ అమ్మానై అమరర్ తమ్ ఏఱ్ఱై ఎల్లాప్పొరుళుమ్ విరిత్తానై ఎమ్మానై విసైనోయ్ కళ్ కాఱ్ఱిన్ మున్నమ్ కడుకి కరియ మాఱ్ఱమాలై పునైన్దు ఏత్తి నాళుమ్ మగిళ్ఙ్వు ఎయ్ తినే.

ఓర్చునట్లు విలక్షణమైన (జ్ఞానభక్తులు పరభక్తి పరజ్ఞాన పరమభక్తులగు) ప్రకారములను (అనుభవించువారలకు) అనుభవింపఁజేయువాఁడైన నిరుపాధికస్వామియు నిత్యసూరులకు భోగ్యుఁడును సకలార్థములను విస్తారముగ నుపదేశించిన నాస్వామియు నైనవానిని పాపములును (రాగద్వేషములు మొదలగు) వ్యాధులును వాయువుకు మునుపు శీఘ్రముగాఁబరుగెత్తి దహింపఁబడునట్లు శబ్దసందర్భము లనియెడి మాలికలను నిర్మించి స్తుతించి సర్వకాలములయందును ఆనందమును బొందితిని.

తా. ఆశ్రయానురూపముగ నాశ్రితు లోర్పనోర్ప తన సకలకల్యాణగుణముల ననుభవించునట్లు వారికి ననుభవోపకరణములైన జ్ఞానభక్తులను పరభక్తి పరజ్ఞాన పరమభక్తులను బ్రసాదించి యనుభవింపఁజేసెడి నిరుపాధిక సర్వస్వామిని ననుభవించి నేను నాపాపములన్నియు నశించునట్లు తిరువాయ్ మొళ్ళిపాడి నిరతిశయానందము కలవాఁడనైతిని. ... ... ... ౫

కరియమేనిమిశై వెళియనీఱుశిఱిదేయిడుమ్ *
పెరియకోలత్తడఙ్కణ్ణన్ విణ్ణోర్ పెరుమాన్ తనై
ఉరియశొల్లాలిశైమాలైగళేత్తి ఉళ్ళప్పెఱ్ఱేఱ్కు *
అరియదుణ్డో వెనక్కు ఇన్ఱుతొట్టుమినియెన్ఱుమే, ౬

కరియ మేనిమిశై వెళి యనీఱు శిఱితే ఇడుమ్ పెరియ కోలమ్ తడమ్ కణ్ణన్ విణ్ణోర్ పెరుమానై ఉరియ శొల్లాల్ ఇశైమాలైకళ్ ఏత్తి ఉళ్ళ ప్పెఱ్ఱేఱ్కు ఎన క్కు ఇన్ఱుతొట్టుమ్ ఇని ఎన్ఱుమ్ అరియతు ఉణ్డో.

శ్యామళమైన శరీరముపై కాటుకచూర్ణమును స్వల్పముగనే ధరించి గొప్ప సౌందర్యముతోఁ గూడినవియు విస్తీర్ణములును నైన నేత్రములుకలవాఁడును (ఆసౌందర్యమునందు) నిత్యసూరులను (మోహింపఁజేసెడి) పరత్వముకలవాఁడును నైన సర్వేశ్వరుని (వాని సౌందర్యమునకు) తగిన శబ్దములచేఁ జేయఁబడిన గానరూపములైన సూక్తిమాలికలచే స్తుతించి అనుభవింప లభించిన నాకు ఈదినము మొదలు ఇక మీఁద ఎల్లప్పుఁడును దుర్లభమైనది కలదా ?

తా, నీలమేఘమువంటి దివ్యమంగళవిగ్రహముకలవాఁడును ఆవిగ్రహమునకనుగుణమైన యంజనముచే నలంకృతములై విశాలములైన దివ్యనేత్రములుకలవాఁడును అట్టి సౌందర్యమును నిత్యసూరులకు ననుభవింపఁజేసినవాఁడును నైన సర్వేశ్వరుని వానికి సదృశములైన శబ్దసందర్భములచే స్తుతించి యనుభవింప లభించిన నాకు ఇక పొందతగిన ప్రయోజన మేమియును లేదు. ... ౬

ఎన్ఱుమొన్ఱాగి ఒత్తారుమిక్కారుగళుమ్ * తన్ఱన
క్కిన్ఱి నిన్ఱానై ఎల్లావులగుముడైయానై *
కున్ఱమొన్ఱాల్ మళైకాత్తపిరానై చ్చొన్మాలైగళ్ *
నన్ఱుసూట్టుమ్ విదియెయ్ దినమ్ ఎన్నకుఱై నమక్కే. ౭

ఎన్ఱుమ్ ఒన్ఱాకి ఒత్తారుమ్ మిక్కారుగళుమ్ తన్ఱనక్కు ఇన్ఱి నిన్ఱానై ఎల్లావులకుమ్ ఉడైయానై మళై కున్ఱమొన్ఱాల్ కాత్త

ఎల్లప్పుఁడును ఏకరూపుఁడై సమానమైన వారును మించినవారును తనకు లేకయే వేంచేసి యున్నవాఁడును సమస్తలోకములను (తనకు శేషములుగా) కలవాఁడును వర్షమునుండి ఒక పర్వతముచే రక్షించిన మహోపకారకుఁడును నైన

7

| | |
|---|---|
| పిరానై శ్శొల్ మాలైకళ్ నన్ఱు శూట్టుమ్ విత్తి ఎయ్ తినమ్ నమక్కు ఎన్న కుఱై. | సర్వేశ్వరుని శబ్దములనియెడి మాలికలను(వాఁడు) ఆశపడి శిరస్సునందు ధరించుటకుఁ దగిన భాగ్యమును పొందితిమి; మనకు ఏమికొఱఁత కలదు ? |

తా. పరత్వమునందును నవతారములయందును నెల్లప్పుఁడును నేకరూపుఁడును తనకు సమానులును నధికులును లేనివాఁడును సమస్తలోకములును తనకు శేషములుగాఁ గలవాఁడును శేషభూతులకు ఇంద్రునిచేవచ్చిన రాళ్ళవర్ష మనియెడి యాపదను నొక గోవర్ధనపర్వతమును ననాయాసముగ నెత్తి రక్షించిన వాఁడును నైన మహోపకారకుని విషయమైన తిరువాయ్ మొళ్ళి యనియెడి పుష్పమాలికలను వాఁ డాదరముతో ధరించునట్లు వానికృప యనియెడి భాగ్యమును లభించినది గాన నింక దాసుని కేమి కొఱఁతలున్నవి ? ... ౭

నమక్కుమ్పూవిన్మిశై నఙ్గైక్కుమ్ ఇన్బనై * ఞాలత్తార్
తమక్కుమ్ వానత్తవర్క్కుమ్ పెరుమానై * తణ్డామరై
శుమక్కుమ్పాతప్పెరుమానై చ్చొన్మాలైకళ్ * శొల్లుమా
అమైక్కవల్లేఱ్కు ఇనియావర్ నికరకల్వానత్తే. ౮

| | |
|---|---|
| నమక్కుమ్ పూవిన్మిశై నఙ్గైక్కుమ్ ఇన్బనై ఞాలత్తార్ తమక్కుమ్ వానత్తవర్క్కుమ్ పెరుమానై తణ్ తామరై శుమక్కుమ్ పాతమ్ పెరుమానై శొన్మాలైకళ్ శొల్లుమాఱు అమైక్కవల్లేఱ్కు అకల్ వానత్తు యావర్ ఇని నికర్. | మనకును తామరపుష్పమునందుఁ బుట్టిన పిరాట్టికిని మనోహరుఁడును భూలోకమునందున్న వారలకును (విశేషజ్ఞులైన) పరమపదవాసులకును నిరుపాధిక సర్వశేషియు చల్లని తామరపుష్పము ధరించునట్లున్న పాదములుకల సర్వాధికుఁడును నైన శ్రియఃపతిని శబ్దసందర్భములను జెప్పునట్లు ధరింప శక్తుఁడైన నాకు విస్తీర్ణమైన పరమపదము నందు (వికారరహితులై యనుభవించువారు) ఎవరు! ఇకమీఁదట సమానులగువారు ? |

తా. అనాదియైన యజ్ఞానసంసర్గముచే నిత్యసంసారులకంటె నీచులైన మనకును ఆత్మగుణపూర్తికల పిరాట్టికిని తన భోగ్యతాతిశయముచే నానందజనకుఁడును నిత్యవిభూతియందు నిత్యసూరులకును లీలావిభూతియందున్న యజ్ఞులకును నిరుపాధికశేషియు స్పృహణీయములైన పాదములుకల సర్వాధికుని ఉద్దేశించి తిరువాయ్ మొళ్ళి పాడుటకు శక్తుఁడైన నాతో సమానులు నిత్యవిభూతి యందును లేరు. ... ... ... ... ౮

వానత్తుమ్వానత్తుళ్ళుమ్బరుమ్ మణ్ణుళ్ళుమ్మణ్ణిన్కీళ్
త్తానత్తుమ్ * ఎణ్డిశైయుమ్ తవిరాదునిన్రాన్ఱనై *
కూనల్శజ్గత్తడక్కైయవనై క్కుడమాడియైవాన
క్కోనై * కవిశొల్లవల్లేఱ్కు ఇనిమాఱుణ్డే. ౯

వానత్తుమ్ ఉళ్ వానత్తు ఉమ్బరుమ్ మణ్ణుళ్ళుమ్ మణ్ణిన్కీళ్ తానత్తుమ్ ఎట్టు తిశైయుమ్ తవిరాతు నిన్రానై కూన నల్ శజ్గమ్ తడమ్ కైయవనై కుడిమాడియై వానమ్కోనై కవి శొల్ల వల్లేఱ్కు ఇనిమాఱు ఉణ్డే.

స్వర్గమునందును దానికిఁ బైయాకాశమునందున్న పైలోకములయందును భూమియందును భూమికిఁ గ్రిందిస్థానములయందును ఎనిమిదివిధములైన పదార్థములయందును ఒకటియు విడువక వ్యాపించియున్నవాఁడును నమ్రతచే దర్శనీయమైన శంఖముకల గొప్ప హస్తముకలవాఁడును కుంభనర్తనముచేసినవాఁడును నిత్యసూరులనుభవించునట్టి పరత్వముకలవాఁడును నైన శ్రియఃపతిని కవి చెప్పుటకు శక్తుఁడనైన నాకు ఇక సమానులు కలరా?

తా. భగవంతునియొక్క పరవ్యూహ విభవాంతర్యామ్యర్చావతారములనుగుఱించి కవిత్వము చెప్పుటకు సమర్థుఁడనైన నాతో సమానులెవరును లేరు. ౯

ఉణ్డుముమిళ్న్దుమ్కడన్దుమిడన్దుమ్ కిడన్దునిన్రుమ్ *
కొణ్డకోలత్తోడువీఱ్ఱిరున్దు మణమ్కూడియుమ్ *

కణ్ణవాన్ శ్శాల్ తనదే ఉలగెననిన్ఱాన్ తన్నై *
వణ్ణమిళ్ నూఱ్ఱా నోత్ర్ఱేన్ అడియార్కిన్బమారియే. ౧౦

ఉణ్డుమ్ ఉమిళ్న్దుమ్ కడన్దుమ్ ఇడన్దుమ్ కిడన్దుమ్ నిన్ఱుమ్ కొణ్డ కోలత్తొడు వీత్తిరున్దు మణమ్ కూడియుమ్ కణ్ణ అన్ శ్శాల్ ఉలకు తన తే ఎన నిన్ఱాన్ తన్నై వణ్ తమిళ్ నూఱ్ఱ నోత్ర్ఱేన్ అడియార్కు ఇన్బమారి.

(ప్రళయమునందు) భుజించియు (సృష్టి కాలమునందు) బయలుపఱచియు గొల్చియు (అవాంతర ప్రళయమునందు వరాహావతారం బెత్తి) పైకెత్తియు (సముద్రతీరమునందు) శయనించియు (దేవతలకు సేవసాదించుచు) నిలిచియు (పట్టాభిషేక కాలమునందు) చేసిన అలంకారముతో వేంచేసియుండియు నిత్యోత్సవమగునట్లు సంశ్లేషమునొందియు సాక్షాత్కరింపఁబడిన ప్రకారములచే లోకములు తనకే శేషములు అనునట్లు ఉన్న సర్వేశ్వరునిగుఱించి విలక్షణమైన ద్రావిడ ప్రబంధమును నిర్మించుటకు (వాని యంగీకారమనియెడి) పుణ్యముచేసితిని. (ఈప్రబంధము) దాసభూతులకు ఆనందమును వర్షించెడి మేఘముగ నున్నది.

తా. ప్రళయకాలమునందు సమస్తలోకములను దన యుదరమునందుంచి రక్షించియు సృష్టికాలమునందు బయలుపఱచియు అవాంతరప్రళయమునందు మునిఁగిపోయిన భూమిని వరాహావతారంబెత్తి యండభిత్తిలోనుండి పైకెత్తియు రామావతారంబెత్తి సముద్రతీరమునందు శయనించియు రావణవధానంతరము సకలదేవతలకు సేవసాదించియు అభిషేకాలంకారముతో వేంచేసియుండియు నిత్యోత్సవమగునట్లు భూదేవితో సంశ్లేషించి రాజ్యమును బరిపాలించియు ఇట్లు ప్రత్యక్షసిద్ధములైన చేష్టితములచే సకలలోకములును తనకు శేషములగునట్లున్న భగవంతుని ఉద్దేశించి తిరువాయ్ మొళి ప్రబంధమును బాడుటకు నేను భాగ్యవంతుఁడనైతిని. ఇదియేగాక సకల శ్రీవైష్ణవులకును నానందావహుఁడును నైతిని.

* మారిమాఱాదతణ్ణమ్మలై వేఙ్గడత్తణ్ణలై *
వారిమాఱాదపైమ్బూమ్బొழிల్ శూழ் కురుకూర్ నకర్ *
కారిమాఱన్ శడకోపన్ శొల్లాయిరత్తిప్పత్తాల్ *
వేరిమాఱాదపూమేలిరుప్పాళ్ వినై తీర్కుమ్. ౧౧

మారి మాఱాత తణ్ అమ్ వేఙ్గడమ్ మలై అణ్ణలై వారి మాఱాత పై పూ పొழிల్ శూழ் కురుకూర్ నకర్ కారి మాఱన్ శడకోపన్ శొల్ ఆయిరత్తు ఇప్పత్తాల్ వేరి మాఱాత పూ మేల్ ఇరుప్పాళ్ వినై తీర్కుమ్.

వర్షము విడువకుండుటవలన చల్లని దర్శనీయమైన వేంగడమనియెడి తిరుమలయందు (వేంచేసియున్న) నిరుపాధికస్వామిని తీర్థము నశింపని దర్శనీయములైన పుష్పసమృద్ధికల తోటలచే వ్యాప్తమైన కురుకూరనియెడి నగరమునందు కారి యని ప్రసిద్ధులైనవారి పుత్రులును మాఱన్ అనియెడి కులనామముకలవారును నైన ఆழ்వార్లు సాదించిన వేయిపాశురములలో నీ పది పాశురములచే మధుప్రవాహము నశింపని తామర పుష్పమునందు నిత్యవాసముచేయుచున్న లక్ష్మి భగవదనుభవవిరోధి పాపములను (తనకటాక్షముచే) పోగొట్టును.

తా. సర్వకాలములయందును నవిచ్ఛిన్నముగ వర్షించుటచే మనోహరమైన తిరుమలయందు నిత్యవాసముచేయుచున్న నిరుపాధికస్వామిని గురించి దివ్యతిరునగరియందు వేంచేసియుండు కారిపుత్రులైన యాழ்వార్లు సాదించిన వేయిపాశురములలో నీ పదిపాశురములను నభ్యసించువారిని పురుషకారభూతురాలగు శ్రీదేవి తన రక్ష్యవర్గములని యభిమానించి వారి సకలపాపములను బోగొట్టును. ౧౧

చతుర్థశతకములో పంచమదశకము ముగిసెను.

ఆழ்వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.

తిరువాయ్ మొழி - చతుర్థశతకములో

# షష్ఠదశకము — తీర్ప్పారై

* తీర్ ప్పారై యామిని ఎజ్ఞనమ్నాడుదుమన్నై న్నమీర్ *
ఓర్ ప్పాలివ్వొణ్ణుదల్ ఉఱ్ఱనన్నోయిదు తేఱినోమ్ *
పోర్ప్పాకుత్తాఱ్ఱు శెయ్దు అన్ఱైవరై వెల్విత్త * మాయప్పోర్
త్తేర్ప్పాకనార్క్కు ఇవళ్ శిన్దైతుழాయ్ త్తిశైక్కిన్ఱదే. ౧

అన్నైన్నమీర్ ఇని తీర్ప్పారై యామ్ ఎజ్ఞనమ్ నాడుతుమ్ ఓర్ ప్పాల్ ఇ ఒళ్ నుతల్ ఉఱ్ఱ ఇతు నల్ నోయ్ తేఱినోమ్; పోర్ పాకుత్తాఱ్ఱు శెయ్తు అన్ఱు ఐవరై వెల్విత్త మాయమ్ పోర్ తేర్ పాకనార్క్కు ఇవళ్ శిన్దై తుழాయ్ తిశైక్కిన్ఱతు.

ఓ తల్లులారా! ఇకమీఁద (ఈ యుపద్రవము) బోఁగొట్టువారిని మనము ఎచ్చట వెతుకుదుము? నిరూపించుటవలన ఈ సుందరమైన ముఖముకల యీమె పొందిన శ్లాఘ్యమయిన ఈ వ్యాధి నెఱిఁగితిమి; యుద్ధమునకుఁ గావలసిన సేనావిభాగములను తానే చేసి (దుర్యోధనాదులు పాండవుల నాక్రమించిన) ఆకాలమందు అయిదుగురిని జయించునట్లు చేసిన ఆశ్చర్యచేష్టితములు కల యుద్ధమునందు (అర్జునునియొక్క) రథమునందు సారథిగానున్న వాని నిమిత్తముగ ఈమెయొక్క మనస్సు కలతజెంది మోహించుచున్నది.

తా. ఓ తల్లులారా! ఈమెయొక్క ఉపద్రవమును జూచినవారందరును ఈమెతోఁగూడ మోహించుచున్నారు గాని యీబాధను దీర్చువా రెవరును లేరు; వారిని నే నెచ్చట వెతకుదును? ఈబాధకు మూలమును నిరూపించి చూచినచో భారతయుద్ధమునకుఁ గావలసిన సకలోపకరణములను తానే సిద్ధపఱచియు పాండ

వులకు సారథిగా నిలిచియు ఆయుధమెత్తనని ప్రతిజ్ఞ జేసి ఆయుధమెత్తియు పగటిని రాత్రిగాఁ జేసియు నిట్లు కృత్రిమయుద్ధము చేసి పాండవులకు జయమును దుర్యోధనాదులకు నాశమును బుట్టించిన కృష్ణునివిషయమునం దీమె యవగాహించుటయే యని తోఁచుచున్నది. ... ... ... ౧

తిశైక్కిన్ఱ దేయివళ్ నోయ్ ఇదుమిక్క పెరుదైయ్వమ్ *
ఇశైప్పిన్ఱి నీరణఙ్గాడుమ్ ఇళదైయ్వమన్ఱిదు *
తిశైప్పిన్ఱియే శఙ్గుశక్కరమెన్ఱివళ్ కేట్క * నీర్
ఇశైక్కిఱ్ఱిరాకిల్ నన్ఱేయిల్ పెఱుమిదుకాణ్మినే. ౨

తిశైక్కిన్ఱతు ఇవళ్ నోయ్ ఇతు మిక్క పెరుమ్ తెయ్ఎమ్ ఇతు ఇశైప్పిన్ఱి నీర్ అణఙ్గాడుమ్ ఇళదైయ్వమ్ అన్ఱు; తిశైప్పిన్ఱియే శఙ్గు శక్కరమ్ ఎన్ఱు ఇవళ్ కేట్క నీర్ ఇశై కిఱ్ఱిరాకిల్ నన్ఱే ఇల్ పెఱుమ్ ఇతు కాణ్మిన్.

భ్రమించునది యీామె బాధ చేనుండును; ఇది సర్వాధికమును అపరిచ్ఛేద్యమును నైన మాహాత్మ్యముకల దేవతచేఁ బుట్టినది; ఇది చేరకుండునట్లు మీారు దైవావిష్టులై యాడుచున్న అల్పదైవము కాదు; భ్రమింపకనే శంఖ చక్రములు అని ఈమె వినునట్లు మీారు చెప్పుటకు సమర్థులైనచో చక్కఁగా జీవించుటను లభించును; దీనిని చూడుఁడు.

తా. ఓ తల్లులారా! ఈమెయందుఁ బ్రీతిచే నీమె పడుచున్న బాధలను జూడజాలక మీారును భ్రమనొంది పడుచున్న బాధలకు నిదానమును మీా రెఱుఁగనివార లైతిరి. మీాకుఁ దెలియఁజెప్పెద వినుఁడు; ఈవ్యాధి సర్వేశ్వరమూలముగఁ బుట్టినది గాని యితర దేవతలచేఁ బుట్టినది కాదు. చిత్తవిభ్రమము లేక చక్కగఁ దెలిసికొనినచో నీవ్యాధి పరిహరింపఁబడునది యగును. యీాబాధయం దీమె శంఖమనియు చక్రమనియుకదా అనుసంధించుచున్నది. దానికిఁ బరిహారముగ మీారును శంఖమనియు చక్రమనియు పలుమాఱనుసంధింపుడు. ఇట్లనుసంధింపగా వినిన యీామెకు వ్యాధి సవాసనముగ నశించి సుఖించును చూడుఁడు.

ఇదుకాణ్మినన్నైమీర్ ఇక్కట్టువిచ్చిశొల్లొణ్డు * నీర్
ఎదువానుమ్ శెయ్దు అజ్గోర్ కళ్లమిత్తైచ్చియుమ్ తూవేన్మిన్ *
మదువార్ తుళాయ్ ముడి మాయప్పిరాన్ కళల్ వాళ్త్తినాల్ *
అదువేయివళుఱ్ఱనోయ్క్కుమ్ అరుమరున్దాకుమే. 3

అన్నైన్మీర్! ఇతు కాణ్మిర్ ఇ కట్టువిచ్చి శొల్ కొణ్డు నీర్ ఎతువానుమ్ శెయ్తు అజ్గు ఓర్ కళ్ళుమ్ ఇత్తైచ్చియుమ్ తూవేన్మిర్; మతువార్ తుళాయ్ ముడి మాయమ్ పిరాన్ కళల్ వాళ్త్తినాల్ అతువే ఇవళ్ ఉఱ్ఱ నోయ్క్కు అరు మరున్దుమాకుమ్.

ఓ తల్లులారా! ఈ పరిహారమును జేసి (ఫలమును) జూడుఁడు; ఈ గుఱిచెప్పెడిదానియొక్క వార్తలను విని మీరు ఏదైనను చేసి ఆస్థలమునందు హేయమైన యొక మద్యమును మాంసమును చల్లకుండుడు; తేనె స్రవించుచున్న తులసిచే నలంకృతమైన కిరీటముకలవాఁడును ఆశ్చర్యకరములైన గుణచేష్టితములచే మహోపకారకుఁడును నైన భగవంతునియొక్క పాదములకు మంగళాశాసనము చేసినచో నదియే ఈమె పొందిన వ్యాధికి శ్లాఘ్యమైన మందగును.

తా. ఓ తల్లులారా! మిక్కిలి నీచురాలైన గుఱిచెప్పెడిదానియొక్క యారడింపువార్తలను విని ఏదో ఒక పరిహారమును జేసెదమని తలఁచి మద్యము మాంసము మొదలగు నిషిద్ధద్రవ్యములను వైష్ణవగృహమునందుచల్లి యాగృహమును చెఱుపకుండుఁడు. మధువు స్రవించుచున్న దివ్యతులసిమాలికలచే నలంకృతంబైన దివ్యకిరీటము కలవాఁడును తనయొక్క ఆశ్చర్యకరములైన గుణచేష్టితములను కనుపఱచిన మహోపకారకుఁడును నైన కృష్ణునియొక్క దివ్యపాదారవిందములకు మంగళాశాసనము చేసినచో అదియే యామెవ్యాధికిఁ దగిన పరిహారము గాన దాని ననుష్ఠించి యీమెవ్యాధిని బరిహరింపఁజూడుఁడు. 3

మరున్దాక మెన్ఱు అజ్గోర్ మాయవలవైశొల్లొణ్డు * నీర్
కరుఙ్గోఴిమ్మజ్ఞైచ్చెఙ్గోఱుమ్ కళనిత్తైత్తెన్నుయర్ *

ఒరుఙ్గాకవేయులకేழுమ్ విழుఙ్గియుమిழ్న్దిట్ట *
పెరున్దేవన్పేర్ శొల్లకిఱ్కిల్ ఇవళై ప్పెఱుదిరే. ౪

మరున్దాకుమ్ ఎన్ఱు అఙ్గోర్ మాయమ్ అలవై శొల్ కొణ్డు నీర్ కరుఙ్గో ఱుమ్ మఱ్ఱై శెఙ్గోఱుమ్ కళఱ ఇఱైత్తు ఎన్ పయన? ఉలకేழுమ్ ఒరుఙ్గాకవే విழుఙ్గి ఉమిழ్న్దిట్ట పెరున్దేవన పేర్ శొల్ల కిఱ్కిల్ ఇవళై పెఱు తిర్.

(ఔషధము కానిదానిని) ఔషధ మగును అని తలంచి అచ్చట యొక కృత్రిమము కలదియు కృత్రిమముగ మాటలాడునదియు నైన దాని యొక్క వార్తలను గొని మీరు నల్లనియన్న మును వేరైన ఎఱ్ఱనియన్నమును బలిప్రదేశము నందు ఉంచినచో ఏమిప్రయోజనము కలదు? సప్తలోకములను ఏకకాలమందే మ్రింగి బయలు పఱచిన పరదేవతయొక్క తిరునామమును జెప్పు టకు సమర్థులైనచో ఈమెను బొందవచ్చును.

తా. పరిహారముకానిదానిని పరిహారముగఁ జెప్పెడి వంచకురాలైన యొక గుఱిచెప్పెడి దానియొక్క మాటలను విని నల్లనియన్నమును ఎఱ్ఱనియన్నమును దేవతాంతరప్రీతికై యుంచినచో మీకేమి ప్రయోజనముకలదు? ఆపత్సఖుఁడైన సర్వస్వామియొక్క దివ్యతిరునామమును జెప్పినచో విలక్షణురాలైన యీమెను బొందవచ్చును; లేనియెడల దుర్లభమగును. ... ... ౪

ఇవళై ప్పెఱుమ్పరిశు ఇవ్వణఙ్గాడుదలన్ఱన్దో *
కువళై త్తడఙ్కణ్ణుమ్ కోవై చ్చెవ్వాయుమ్పయన్దనళ్ *
కవళక్కడాక్కళిఱట్టపిరాన తిరునామత్తాల్ *
తివళవ్వొణ్డికొణ్డు నీరిట్టిడుమిన్ తణియుమే. ౫

ఇవళై పెఱుమ్ పరిశు ఇ అణఙ్గాడుతల్ అన్ఱు అన్దో! కువళై తడమ్ కణ్ణుమ్ కోవై

ఈమెను లభించు ప్రకారము ఈ దైవ మావేశించి యాడుటకాదు; అయ్యో! నల్లకలు వలవలె నల్లనివియు విశాలములుఁను నైన నేత్రము లును దొండపండువలె ఎఱ్ఱని అధరమును విడ

శేమ్ వాయుమ్ పయన్దనళ్; కవళమ్ కడా కళిఱు అట్ట పిరా౯ తిరునామత్తాల్ ధవ శమ్ పాడి కొణ్డు నీర్ ఇట్టి ఱుమి౯ తణియుమ్.

ర్ణము లాయెను. (మదకరములగు ఔషధము లను) భుజించి మదజలము కారుచున్న గజమైన (కువలయాపీడమును) సంహరించిన ఉపకారకుని యొక్క తిరునామముచే పరిశుద్ధమైన పాదధూళు లను గొని మీరు ప్రయోగించుడు (వైవర్ణ్యము) నశించును.

తా. సుందరమైన దేహముకల యీమెకు కువలయములవలె నల్లని నేత్రములును దొండపండువలె ఎఱ్ఱని యధరమును వివర్ణము లగుచున్నవి. దీనికిఁ బరిహారము నిషిద్ధానుష్ఠానము కానేరదు. దీనిచే నీమెనుబొందుట దుర్లభము. మదముచేత నతి క్రూరమైన కువలయాపీడమును సంహరించిన యుపకారకుని యొక్క దివ్యనామము ననుసంధించుచు భాగవతులయొక్క శ్రీపాదధూళిని నీమెపై పూయుఁడు. వైవర్ణ్యము తత్క్షణమందే నశించును. ఇదియే యీమెను లభించుటకు సదుపాయము. ... ... ... ౫

తణియుమెన్బుముదిల్లై నీరణఙ్గాడుదిరనైన్నమీర్ *
పిణియుమొళ్ళికిన్ఱదిల్లై ప్పెరుకుమిదువల్లాల్ *
మణియినణినిఱమాయ౯ తమరడినీఱుకొణ్డు *
అణియముయలిల్ మఱ్ఱిల్లైకణ్డీరివ్వణఙ్గుక్కే. ౬

అనైన్నమీర్ తణియుమెన్బుముతు * ఇన్ఱి నీర్ అణఙ్గాడుతిర్; ఇతు పిణియుమ్ పెరుకుమల్లాల్ ఒళ్ళికిన్ఱతు ఇల్లై; మణియిల్ అణి నిఱమ్ మాయ౯ తమర్ అడినీఱు కొణ్డణియ ముయలిల్ ఇ

ఓ తల్లులారా! తప్పినసమయము లేకయే మీరు సాధనాంతరము లనుష్ఠించుచున్నారు. దీని నిమిత్తముగ వ్యాధియు వృద్ధియగుచున్నదేగాని నివృత్తము కాలేదు; నీలరత్నమునకంటె సుందరమైన వర్ణముకలవాఁడును ఆశ్చర్యభూతుఁడును నైన కృష్ణునియందు (శేషత్వజ్ఞానముకల) భాగవతులయొక్క పాదధూళులను ధరింపఁజేయునట్లు

| అణజ్గుక్కు మశ్ఙు ఇల్లై కణ్ణీర్. | ఉద్యోగించినచో ఈదైవావిష్టురాలైన యీామెకు ఇతరపరిహారము లేదు చూడుడు. |
|---|---|

తా. ఓ తల్లులారా! ఇది బాలికయని తలఁచి నావా ర్తల నంగీకరింపక మీారు సాధనాంతరములను జేయుటకు నారంభించియున్నారు; ఈ కారణమును బట్టియే యీామెకు వ్యాధి యధికమగుచున్నది గాని నివృత్తముకాలేదు. ఇక మీాఁదనైన నేచెప్పెడు పరిహారమును వదలకచేయుఁడు. నీలరత్నమునకంటె నిరతిశయ విలక్షణమైన విగ్రహసౌందర్యము కలవాఁడును, ఆశ్చర్యకరములగు చేష్టితాదులు కలవాఁడును నైన కృష్ణవిషయమునందు శేషభూతులని సంబంధ జ్ఞానముకల పరమభాగవతుల పాదధూళులను నీమెకిచ్చి ధరింపఁజేసినచో యిదియే యీావ్యాధికి ముఖ్యపరిహార మగును. ... ... ౬

అణజ్గుక్కరుమరున్దెన్ఱు అజ్గోరాడుమ్కళ్ళుమ్పరాయ్ *
శుణజ్గైయెటిన్దు నున్తోళ్ కులైక్కప్పడుమన్నైమీర్ *
ఉణజ్గల్ కెడ కఴుదై యుదడాట్టమ్కణ్డెన్పయన్ *
వణజ్గీర్కళ్ మాయప్పిరాన్ తమర్ వేదమ్వల్లారై యే. ౭

| అన్నైమీర్ అణజ్గుక్కు అరు మరున్దు ఎన్ఱు అజ్గు ఓర్ ఆడుమ్ కళ్ళుమ్ పరాయ్ శుణజ్గై ఎటిన్దు నుమ్ తోళ్ కులైక్క పడుమ్; ఉణజ్గల్ కెడ కఴుదై ఉతడాట్టమ్ కణ్డు ఎన్ పయన్? మాయమ్ పిరాన్ తమర్ | ఓ తల్లులారా! (దివ్యస్వభావముకల) చిన్న దానికి దుర్లభంబైన మందు అని తలచి ఆ దేవతాంతరవిషయముగ ఒక మేకయు మద్యమును (నివేదింప) ప్రార్థించి (ఆ దేవతావేశముచే) రోమాంచము పుట్టి మీాయొక్క భుజములు కదలుచు నాడునట్లు పడుచున్నవి. ధాన్యము నశించునట్లు (దానిని తినుచున్న) గాడిదెయొక్క అధరములయం దాటనుజూచి ఏమి ప్రయోజనము? ఆశ్చర్యచేష్టితములను ఉపకరించినవానియొక్క |

వేతమ్వల్లారై పణజ్గీర్ కళ్. దాసులును వైదికాగ్రేసరులును నైన భాగవతులను ఆశ్రయించుటకు యత్నింపుఁడు.

తా. ఓ తల్లులారా! దివ్యమైన స్వభావముకల యీచిన్న దానికి ననుకూలమైన ఔషధమని తలఁచి నిషిద్ధద్రవ్యములను దేవతాంతరములకు నివేదింపవలయునని ప్రార్థించి ఆదేవతావేశముచేఁ జేతులుతట్టుచు గుంపుగుంపుగాఁ గూడి యాడుచున్నారు. జీవన హేతువైన ధాన్యము చెడునట్లు దానిని గాడిదె తినుచుండగా జూచుచున్న వారలకు వలె మీకేమి ప్రయోజనము కలదు? ఇట్టి దుర్వ్యాపారములను వదలి స్వరూపానుసారముగ భాగవతులను సమస్కరించినవారై యీమెకుఁబుట్టిన వ్యాధిని సవాసనముగఁ బరిహరింపజూడుఁడు. ౭

వేదమ్వల్లార్ కళై క్కొణ్డు విణ్ణోర్ పెరుమాన్ తిరు
ప్పాదమ్పణిన్దు * ఇవళ్ నోయిదు తీర్త్తుక్కొళ్ళాదుపోయ్ *
ఏతమ్పత్తైన్దల్ల శెయ్దు కళ్లూడుకలాయ్త్తూయ్ *
కీదముళ్ళిట్టు నీరణజ్గాడుదల్ కీళ్మైయే. ౮

వేతమ్ వల్లార్ కళై క్కొణ్డు విణ్ణోర్ పెరుమాన్ తిరు పాతమ్ పణిన్దు ఇవళ్ ఇతు నోయ్ తీర్త్తుక్కొళ్ళాతు పోయ్ ఏతమ్ పత్తైన్దు అల్ల శెయ్తు ఊడు కళ్ కలాయ్ తూయ్ గీతమ్ ముళ్ళిట్టు నీర్ అణజ్గు ఆడుతల్ కీళ్మైయే.

వేదముల నభ్యసించిన భాగవతులను పురుషకారముగఁజేసి నిత్యసూరులచే సేవింపఁదగిన సర్వేశ్వరునియొక్క భోగ్యములైన పాదములను ఆశ్రయించి యీమెయొక్క ఈవ్యాధిని శమింపఁజేయకనే (ఇతర దేవతలను) ఆశ్రయించి దోషకరములైన (శబ్దములను) జెప్పి అయుక్తములనుజేసి నడుమనడుమ మద్యమును కలిపి చల్లి గానమునకుఁదగిన వాద్యమును వాయించి మీరు దైవావిష్టులై ఆడుట దోషకరమగును.

తా. సకలవేదములయొక్క తాత్పర్యముల నెఱిఁగిన పరమభాగవతులను పురుషకారముగఁజేసి భగవంతునియొక్క పాదారవిందములను శరణములుగఁ

బొంది యీామెకుఁబుట్టిన వ్యాధిని నివర్తింపక, స్వరూప నాశకరములగు దేవ తాంతర విషయములైన శబ్దములను జెప్పియు వాని ననుసరించియు ఆరాధనోప కరణములతో నిషిద్ధద్రవ్యములను జేర్చి గృహమధ్యమందుఁ జల్లి వైష్ణవగృహ మును దూషించియు ఆ దేవతాంతర విషయముగఁ బాడియు వాద్యములను వాయిం చియు దేవతావేశముచే నాడియు ఇట్లు క్షుద్ర దేవతల నాశ్రయించినచో మీా కిది మిక్కిలి దోషకరమగును. ... ... ... ౮

కీழ్మైయినాలజ్గు ఓర్ కీழ్మకనిట్టముழ్లిక్కీழ్ *
నాழ్మైపలశొల్లి నీరణజ్గాడుమ్పాయ్ కాణ్గిలేన్ *
ఏழ్మైప్పిఅప్పూక్కుమ్ శేమమ్ ఇన్నోయ్‌క్కుమీా దేమరున్దు *
ఊழ్మైయిల్ కణ్ణపిరాన్ కழల్వాழ్త్తుమినున్నిత్తే. ౯

కీழ్మైయినాల్ అజ్గోర్ కీழ్మకన్ ఇట్ట ముழக్కిల్ నాழ్మై పల శొల్లి నీర్ అణజ్గు ఆడుమ్ పాయ్ కాణ్గి లేన్; ఏழ్మై పిఱప్పుక్కుమ్ శేమమ్ ఈతే ఇన్నోయ్‌క్కుమ్ మరున్దు; ఊழ్మైయిల్ కణ్ణపిరాన్ కழల్ ఉన్నిత్తు వాழ్త్తుమిన్.

నికర్షమువలన అచ్చట యొక నీచుఁడు వాయించుచున్న వాద్యమునం దవగాహించి అబద్ధములను అనేకవిధములుగఁ జెప్పి (మీారు) దైవావిష్టులై ఆడుచున్న నిష్ఫలవ్యాపారములను జూడలేను. ఏడుజన్మములకును క్షేమకరమగు ఇదియే ఈవ్యాధికి ఔషధము; క్రమక్రమముగ కృష్ణునియొక్క పాదములను అనుసంధించి మంగళాశాసనము చేయుఁడు.

తా. మీారు మిక్కిలి నీచుఁడైన చండాలుఁడు వాయించుచున్న వాద్య మునం దవగాహించియు దేవతాంతరమునకు లేనిగుణములను బలువిధములుగాఁ జెప్పియు దైవావిష్టులై యాడియు ఇట్లు నిష్ఫలవ్యాపారములను జేయుచున్నారు. వీటిని నేను జూడఁజాలను. ఈమె జీవింపవలయునని మీా కపేక్షయున్నచోఁ

గృష్ణునియొక్క దివ్యపాదారవిందముల ననుసంధించి యనవరతము మంగళా శాసనము చేయుఁడు. ... ... ... ౯

ఉన్నిత్తుమఱ్ఱొరు తెయ్వన్దొழாళ్ అవనై యల్లాల్ *
నుమ్మిచ్చైచ్చొల్లి నుమ్తోళ్ కులైక్కప్పడుమన్నైమీర్ *
మన్నప్పడుమఱైవాణనై వణ్డువరావతి
మన్ననై * ఏత్తుమిన్ ఏత్తుదలుమ్తొழுదాడుమే. ౧౦

అవనై అల్లాల్ మఱ్ఱు ఒరు తెయ్వమ్ ఉన్నిత్తు తొழாళ్; అన్నైమీర్ నుమ్ ఇచ్చై శొల్లి నుమ్ తోళ్ కులైక్క పడుమ్; మన్న పడుమ్ మఱై వాణనై వణ్డువరాపతి మన్ననై ఏత్తుమిన్; ఏత్తుతలుమ్ తొழுతు ఆడుమ్.

ఆ సర్వేశ్వరునిదప్ప ఇతరమైన ఒక దేవతను స్మరించి నమస్కరింపదు. ఓ తల్లులారా! మీకు ఇష్టములను జెప్పి మీయొక్క భుజములు (దేవతాంతరవిషయముగ) వ్యాపించుటకు యత్నించుచున్నవి (దానిని విడిచి) నిత్యములును మనస్సుచే గ్రహింపఁబడునవియు నైన వేదములకు ముఖ్యప్రతిపాద్యుఁడును శ్రీమద్ద్వారకకు నధిపతియు నైన కృష్ణుని స్తోత్రముచేయుఁడు. స్తుతింపగా (వానిని) స్మరించి (సంభ్రమముతో) నాడును.

తా. ఓ తల్లులారా! ఈమె సర్వరక్షకుఁడైన నారాయణునిదప్ప యితర క్షుద్రదేవతలను నమస్కరించునట్టి స్వభావముకలది కాదు. ఇట్లు దేవతాంతర గంధమును లేని యీమెవ్యాధిని దీర్చుటకై క్షుద్రదేవతలను నమస్కరించి యధికముగ దుఃఖింపఁజేయక సకలవేద ప్రతిపాద్యుఁడును నాశ్రిత వాత్సల్యము మొదలగు సకల కల్యాణగుణములు కలవాఁడును శ్రీమద్ద్వారకకు నధిపతియు నైన కృష్ణుని స్వరూపానురూపముగ స్తుతింపుడు. ఈమె యుజ్జీవించును. ౧౦

* తొழுదాడిత్తూమణివణ్ణనుక్కాళ్చెయ్దు నోయ్తీర్న్ద *
వழுవాదతొల్పుకழ் వణ్ కురుగూర్చ్చడకోపన్ * శొల్

వழுవాదవాయిరత్తుళ్ ఇవై పత్తువెఱికళుమ్ *
తొழுదాడిప్పాడవల్లార్ తుక్కశీలమిలర్ కళే. ౧౧

తొழுతు ఆడి తూ మణి వణ్ణనుక్కు ఆళ్ శెయ్దు నోయ్ తీర్న్ద వழுవాత తొల్ పుకழ் వణ్ కురుకూర్ శడకోపన్ శొల్ వழுవాత ఆయిరత్తుళ్ వెఱికళ్ ఇవై పత్తుమ్ తొழுతు ఆడి పాడ వల్లార్ తుక్కమ్ శీలమ్ ఇలర్ కళ్.

నమస్కరించియు నర్తనముచేసియు ఉజ్జ్వలమైన నీలరత్నమువంటి కాంతికల కృష్ణునికి కైంకర్యములు చేసి (భగవద్విశ్లేషముచేఁ బుట్టిన దుఃఖమనియెడి) వ్యాధి నశించునట్లు (దేవతాంతర సంసర్గమనియెడి) దోషములేకయే స్వాభావసిద్ధమైన యశస్సుకలవారును విలక్షణమైన తిరునగరికి నిర్వాహకులును నైన ఆళ్వార్ల సాదించిన (భగవత్స్వరూపాదులయం దొకటియు) విడువక ప్రతిపాదించుచున్న వేయిపాశురములలో పైత్యనివృత్తిని విషయీకరించిన ఈ పదిపాశురములను నమస్కరించియు (పరవశులై) ఆడియు గానముచేయుటకు సమర్థులు దుఃఖించునట్టి స్వభావము లేనివారగుదురు.

తా. భగవద్విషయమునందుఁ బ్రేమపరవశులై కైంకర్యముచేసి భగవద్విశ్లేషముచేఁ బుట్టిన దుఃఖమనియెడి వ్యాధి సమూలముగ నశించునట్లు నిరవధికయశస్సుకలవారును విలక్షణమైన తిరునగరికి నిర్వాహకులును నైన యాళ్వార్ల సాదించిన వేయిపాశురములలో చిత్తభ్రమ నివృత్తివిషయములగు యీ పదిపాశురములను ప్రేమతో నభ్యసించువారు భగవద్విశ్లేషముచేఁ బుట్టిన దుఃఖమును దానికిఁ బరిహారార్థమైన దేవతాంతరానువృత్తిచేఁ గలిగిన దుఃఖమును లేని స్వభావముకలవారగుదురు. ... ... ... ౧౧

చతుర్థశతకములో షష్ఠదశకము ముగిసెను.

ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.

తిరువాయ్ మొழி - చతుర్థశతకములో

# సప్తమదశకము — శీలమిల్లా

* శీలమిల్లాచ్చిఱియనేలుమ్ శెయ్‌వినై యో పెరితాల్ *
ఞాలముణ్డాయ్ ఞానమూర్తీ నారాయణావెన్ఱెన్ఱు *
కాలమ్‌తోఱుమ్‌యానిరున్దు కైతలై పూశలిట్టాల్ *
కోలమేనికాణవారాయ్ కూవియుమ్‌కొళ్ళాయే. ౧

ఞాలమ్ ఉణ్డాయ్ ఞానమ్ మూర్తీ నారాయణా ఎన్ఱెన్ఱు కాలన్దోఱుమ్ యాన్ ఇరున్దు కైతలై పూశలిట్టాల్ కోలమ్ మేని కాణ వారాయ్ కూవియుఙ్గొళ్ళాయ్; శీలమ్ ఇల్లా శిఱియనేలుమ్ శెయ్ వినై పెరితాల్.

(ప్రళయకాలమునందు) భూమిని ఉదరమునం దుంచినవాఁడును విలక్షణజ్ఞానమును శరీరముగాఁగలవాఁడును నైన (శరీర శరీరిభావసంబంధముకల) నారాయణుఁడా! అని పలుమారను సంధించి ప్రతికాలమందును నేను ఆశతోనుండి హస్తములు శిరస్సునం దుండునట్లు గట్టిగాఁ బిలిచినయెడల సుందరమైన శరీరమును (నేను) సాక్షాత్కరించుటకు వేంచేయకయున్నావు (నన్ను) పిలుపింపనివాఁడును నైతివి; మంచిచరిత్రము లేకయే చిన్నవాఁడనైనను చేసిన పాపము గొప్పగానున్నది.

తా. ఆశ్రితు లపేక్షింపక యుండునప్పుడే ప్రళయాపదకు రక్షించిన నిరుపాధిక రక్షకుఁడా! నిరతిశయ జ్ఞానస్వరూపుఁడా! ఓ నారాయణుఁడా! అని నేను పలుమారు పిలిచినను నీవు సేవ సాదింపకపోతివి. నిన్ను సాక్షాత్కరింపకుండునట్లు నేచేసిన పాపములు మిక్కిలి యతిశయించియున్నవి. ఇది ఏమాశ్చర్యము? ... ... ... ... ౧

కొళ్ళమాళావిన్బవెళ్ళమ్ కోతిలతన్దిడుమ్ * ఎన్
వళ్ళలేయోవైయజ్గొణ్డ వామనావోవెన్ఱెన్ఱు *
నళ్ళిరావుమ్నన్ పకలుమ్ నానిరున్దోలమిట్టాల్ *
కళ్ళమాయావున్నై ఎన్ కణ్గాణవన్దీయాయే.

వైయమ్ కొణ్డ వామనా కొళ్ళ మాళా ఇన్బ వెళ్ళమ్ కోతు ఇల తన్దిడుమ్ ఎన్ వళ్ళలే ఓఓవెన్ఱెన్ఱు నళ్ళిరావుమ్ నన్ పకలుమ్ నాన్ ఇరున్దు ఓలమిట్టాల్ కళ్ళ మాయా ఉన్నై ఎన్ కణ్ కాణ వన్దు ఈయాయ్.

భూమిని స్వాధీనపఱచుకొనిన ఓ వామనుఁడా! అనుభవింపఁగా అంతములేని ఆనంద సముద్రమును దోషములేనట్లు ఉపకరించుచున్న నా మహోదారుఁడా! ఓ! ఓ! అని చెప్పి మధ్య రాత్రమునందును మంచి పగటియందును నేను (ఇతరవ్యాపారములు లేనివాఁడై) ఉండి పిలిచి నచో కృత్రిముఁడైన ఆశ్చర్యభూతుఁడా! నిన్ను నాయొక్క నేత్రములు సాక్షాత్కరించునట్లు వేంచేసి (నేత్రానుభవమును) ఇమ్ము.

తా. మహాబలివశమునందున్న త్రైలోక్యమును వామనావతారంబెత్తి వశపఱచుకొనిన మహోపకారకుఁడా! అంతరంగముగ నానందమును నాకిచ్చి యుపకరించు మహోదారుఁడా! అని నేను నీ యుపకారములనుజెప్పి యహోరాత్రము పిలిచినను నాకు సేవ సాదింపకయున్నావు. ఇట్లుండుట నీకుఁదగునా? ౨

ఈవిలాతతీవినైకళ్ ఎత్తనై శెయ్తనన్గొల్ *
తావివైయమ్కొణ్డఎన్దాయ్ తామోదరావెన్ఱెన్ఱు *
కూవికూవి నెఞ్జురుకి కణ్ పనిశోరనిన్ఱాల్ *
పావినీయెన్ఱొన్ఱుశొల్లాయ్ పావియేన్ కాణవన్దే. 3

ఈవు ఇలాత తీ వినైకళ్ ఎత్తనై శెయ్తనన్గొల్

నాశములేని క్రూరములైన పాపములను ఎంతమాత్రము చేసితినో? (పాదములచేఁ) గొల్చి

తావి వైయమ్ కొణ్డ ఎ
న్దాయ్ తామోతరా ఎన్రెన్ఱు
కూవికూ్కవి నెఞ్జు ఉరుకి
కణ్ పని శోర నిన్ఱాల్ పావి
యేఁ కాణ వన్దు నీ పావి
ఎన్ఱు ఒన్ఱు శొల్లాయ్.

జగత్తును స్వాధీనపఱచుకొనిన నాస్వామీ! (యశోద త్రాటిచేఁ గట్టినప్పుఁడు కలిగిన) త్రాటి కాయ నుదరమునందు కలవాఁడా! అని చెప్పి పిలిచిపిలిచి మనస్సు కరిగి కన్నీరుగాఁ గారునట్లు ఉండినచో పాపిష్ఠుఁడనైన నేను సాక్షాత్కరించు నట్లు వేంచేసి నీవు పాపిష్ఠుఁడవు అని ఒకమాట చెప్పకనున్నావు.

తా. వామనావతారంబెత్తియు కృష్ణావతారంబెత్తియు నీవుచేసిన దివ్యోప కారముల ననుసంధించి నిరవధిక ప్రీతిప్రేరితుఁడనై నేను పలుమాఱు పిలిచియు నీవు సేవసాదింపనందున యార్తిచే మనశ్శైథిల్యము నొంది ధారధారగాఁ గారు చున్న కన్నీరుతోనున్న నాకెదుట వేంచేసి నీవు పాపిష్ఠుఁడవు నీవు నన్ను సాక్షా త్కరించుటకుఁ దగిన భాగ్యవంతుఁడవు కావని యొకమాట చెప్పరాదా? 3

కాణవన్దేఁ కణ్ముకప్పే తామరైక్కణ్ పిఱప్పి *
ఆణిశెమ్బొన్మేనియెన్దాయ్ నిన్ఱరుళాయెన్రెన్ఱు *
నాణమిల్లాచ్చిఱుతకైయేఁ నానిజ్గలఱ్ఱువదేఁ *
పేణివానోర్ కాణమాట్టా ప్పీడుడైయప్పనైయే. ౪

వానోర్ పేణి కాణ మాట్టా పీడు ఉడై అప్పనై ఆణి శెమ్బొన్ మేని ఎన్దాయ్ తామరై కణ్ పిఱప్పి కాణ వన్దు ఎన్ కణ్ముకప్పే నిన్ఱరుళాయ్ ఎన్రెన్ఱు నాణమిల్లా శిఱుతకైయేఁ నాన్ ఇజ్గు

దేవతలు ఆదరించి సాక్షాత్కరించుటకు అశక్తులగునట్లున్న మాహాత్మ్యముకల స్వామిని శ్రేష్ఠమైన యెఱ్ఱని స్వర్ణమువంటి తిరుమేనుకల ఓ నాస్వామీ! తామరపుష్పములవంటి నేత్ర ములు ప్రకాశించునట్లు (నన్ను కటాక్షించుకొని) (నేను) సాక్షాత్కరించునట్లు వేంచేసి నా నేత్ర ములకు మునుపు సేవసాదింప కృపఁజేయుమా! అని పలుమాఱుచెప్పి లజ్జలేనివాఁడనై నీచస్వభా

అలన్ ఱువతు ఎన్. వృడనైన నేను ఇచ్చట మొఱలిడుటకు ఏమి ప్రయోజనము కలదు ?

తా. నిరవధికస్పృహణీయమైన దివ్యమంగళ విగ్రహముకల ఓ స్వామీ! బ్రహ్మాదిదేవతలుకూడ స్వయత్నముచే సాక్షాత్కరించుట కశక్తులగునట్లున్న మాహాత్మ్యముకల నిన్ను నేను సాక్షాత్కరించునట్లు నా నేత్రములకు మునుపు వేంచేసి సేవసాదింప కృపఁజేయవలయునని నే నాశపడి యేమి ప్రయోజనము కలదు ? అయినను నే నిట్లు ప్రార్థించుటకుఁ గారణము - నాకు లజ్జలేకపోవుటయే గాక వేఱులేదు. ... ... ... ... ౪

అప్పనేఅడలాழிయానే ఆழ்కడలైక్కడైన్ద
తుప్పనే * ఉన్తోళ్ కళ్ నాన్గుమ్ కణ్డిడక్కూడుజ్గొలెన్ఱు *
ఎప్పొழுదుమ్కణ్ణనీర్ కొణ్డు ఆవితువర్ న్దుతువర్ న్దు *
ఇప్పొழுదేవన్దిడాయెన్ఱు ఏழைయేన్నోక్కువనే. ౫

అప్పనే అడల్ ఆழி యానే ఆழ் కడలై కడైన్ద తుప్పనే ఉన్ తోళ్ కళ్ నాన్గుమ్ కణ్డిడకూడుజ్గొల్ ఎన్ఱు ఎప్పొழுతుమ్ కణ్ణనీర్ కొణ్డు ఆవి తువర్ న్దుతువర్ న్దు ఇప్పొழுతే వన్దిడాయ్ ఎన్ఱు ఏழை యేన్ నోక్కువన్.

ఓ ఉపకారకుఁడా! యుద్ధోన్ముఖమైన చక్రాయుధము కలవాఁడా! అగాధమయిన సముద్రమును చిలికిన సామర్థ్యముకలవాఁడా! నీ యొక్క భుజములు నాల్గింటిని సాక్షాత్కరించుటకు శక్యమా ? అని తలఁచి సర్వకాలములయందును కన్నీరుతోఁగూడి ప్రాణము శోషించుటకు (మునుపు) ఈక్షణమందే వేంచేయవలయును అని (అపేక్షించి) చవలుఁడనైన నేను (అంతట) చూచుచున్నాను.

తా. ఆశ్రితుల విషయమునందు నుపకరించు స్వభావముకలవాఁడును వారి విరోధులను బోఁగొట్టు స్వభావముకల చక్రాయుధమును సదా ధరించువాఁడును అగాధమైన క్షీరసముద్రమును చిలికి యమృతము నెత్తి దేవతల కిచ్చి వారి యపే

క్షితములను నెరవేర్చిన సామర్థ్యముకలవాఁడును నైన ఓ స్వామీ! బ్రహ్మాదులకుఁగూడ సాక్షాత్కరించుట కశక్యములగు నీ దివ్యచతుర్భుజములను సాక్షాత్కరింపవలయు నని యపేక్షించుచున్నాను; ఇది శక్యమా? ఇట్లశక్యమైనదాని నాశపడుటకుఁ గారణము నాయొక్క ప్రబలచాపల్యమే. ... ౫

నోక్కినోక్కి ఉన్నైక్ కాణ్బాన్ యానెనదావియుళ్ళే *
నాక్కునీళ్వాన్ ఞానమిల్లై నాడోఱుమెన్నుడైయ *
ఆక్కైయుళ్ళుమావియుళ్ళుమ్ అల్లపుఱత్తినుళ్ళుమ్ *
నీక్కమిన్ఱి యెజ్ఞుమ్‌నిన్ఱాయ్ నిన్నైయఱిన్దఱిన్దే. ౬

నాడోఱుమ్ ఎన్నుడైయ ఆక్కైయుఃళ్ళుమ్ ఆవియుళ్ళుమ్ అల్లపుఱత్తినుళ్ళుమ్ నీక్కమిన్ఱి ఎజ్ఞుమ్ నిన్ఱాయ్ నిన్నై అఱిన్దఱిన్దు ఉన్నైక్ కాణ్బాన్ నోక్కి నోక్కి యాన్ ఎనతు ఆవియుళ్ళే నాక్కునీళ్వాన్ ఞానమ్ ఇల్లై.

ప్రతిదినము నాయొక్క శరీరములోనుండు హృదయమునందును ఆత్మస్వరూపమునందును ఈ రెంటికంటె విలక్షణమై (స్వరూపమునకంటె వేరైన) ఇంద్రియాదులలోను ఒకటియు విడువక అంతట అంతరాత్మగా నున్నవాఁడా! నిన్ను (సదా సన్నిహితుఁడని) ఎల్లప్పుఁ డెఱిఁగి నిన్ను సాక్షాత్కరించుటకై చూచిచూచి నేను నాయొక్క మనస్సునందు ఆశపడుచున్నాను; (అంతరాత్మగా నుండువాఁ డతీంద్రియుఁ డనియెడి) జ్ఞానములేదు.

తా. నా హృదయమునందును ఆత్మస్వరూపమునందును ఇంద్రియాదులయందును సర్వదా సర్వత్ర సన్నిహితుఁడైయుండియు నీవు నాకు సేవసాదింపకయుండుటకుఁ గారణము నీవు నన్ను స్మరింపకుండుటయే యని నే నెఱిఁగియుండియు జ్ఞానశూన్యుడగుటవలన సాక్షాత్కరించుట కాశపడుచున్నాను. ... ౬

అఱిన్దఱిన్దు తేఱిత్తేఱి యానెనదావియుళ్ళే *
నిఱైన్దఞానమూర్త్తియాయై నిన్మలమాకవైత్తు *

పిఱన్దుమ్ శెత్తుమ్‌నిన్ఱిడఱుమ్ పేదైమై తీర్‌న్దొఴిన్దేన్ *
నఱున్దుఴాయిన్ కణ్ణియమ్మా నాననైక్కణ్డుకొణ్డే. ౭

నఱు తుఴాయ్ కణ్ణి అమ్మా నాన్ ఉన్నై కణ్డు కొణ్డు అఱిన్దఱిన్దు తేఱి త్తేఱి యాన్ ఎనతు ఆవియుళ్ళే నిఱైన్దఞానమూర్తి యాయై నిన్మలమాక వైత్తు పిఱన్దుమ్ శెత్తుమ్ నిన్ఱు ఇడఱుమ్ పేదైమై తీర్‌న్దొఴిన్దేన్.

పరిమళముచే నధికమై తులసిచేఁ గట్టఁబడిన మాలికలుకల ఓ సర్వాధికుఁడా! నేను నిన్ను సాక్షాత్కరించి (ప్రభావమువలన) చక్కఁగఁ దెలిసికొని నిశ్చయజ్ఞానము కలవాఁడనైన నేను నాయొక్క ప్రాణమున కాశ్రయమైన (మనస్సునందు) పరిపూర్ణజ్ఞానస్వరూపుఁడవైన నిన్ను నిర్మలమగునట్లు ఉంచి జననమరణములు కలవాఁడనై యుండి దుఃఖించుచున్న అజ్ఞానమును బోఁగొట్టుకొంటిని.

తా. స్వస్వరూప పరస్వరూప పురుషార్థస్వరూప ఉపాయస్వరూప విరోధిస్వరూపములయందు నిశ్చయజ్ఞానము కలవాఁడనైన నేను నిరవధికజ్ఞానస్వరూపుఁడవైన నిన్ను మనస్సునందు స్థిరముగనుంచి నీ కటాక్షాతిశయముచేఁ జననమరణములు మొదలగు దుఃఖములను బోఁగొట్టుకొనినవాఁడనైతిని. ఇట్లుపకరించినను ఆ యుపకారములు చాలవు. ... ... ౭

కణ్డుకొణ్డెన్ కైకళార నిన్ తిరుప్పాదఙ్గళ్ మేల్ *
ఎణ్డిశైయుముళ్ళపూక్కొణ్డు ఏత్తియుకన్దుకన్దు *
తొణ్డరోఙ్గళ్ పాడియాడ చ్చూఴ్‌కడల్ ఞాలత్తుళ్ళే *
వణ్డుఴాయ్ కణ్ణివేన్దే వన్దికకిల్లాయే. ౮

కణ్డుకొణ్డు ఎన్ కైకళ్ ఆర నిన్ తిరుప్పాతఙ్గళ్ మేల్ ఎణ్డిశైయుమ్ ఉళ్ళ పూ కొణ్డు ఏత్తి ఉకన్దుకన్దు తొణ్డరోఙ్గళ్

నేత్రములచే సాక్షాత్కరించి నాహస్తములు పూర్ణములగునట్లు నీయొక్క శ్రీపాదములయందు ఎనిమిది దిక్కులలో ఉండు పుష్పములను దెచ్చి స్తోత్రపూర్వకముగ సమర్పించి మిక్కిలి

పాడియాడ కడల్ శూழ్ ఞాలత్తుళ్ళై వణ్ తుழாయిర్ కణ్ణి వేన్దే వన్దిడకిల్లాయ్.

సంతసించి దాసభూతులమగు మేము పాడునట్లును, నాడునట్లును, సముద్రము చుట్టుకొనిన భూమి యందు విలక్షణమైన తులసీమాలికలుకల ఓ స్వామీ! వేంచేయకనున్నావు.

తా. ఓ స్వామీ! మానసానుభవముమాత్రమేగాక నా నేత్రములచే నిన్ను సాక్షాత్కరించి నాహస్తములు తృప్తినొందునట్లు పుష్పములచే నీ దివ్యపాదారవిందంబులను పూజించి యందువలన నిరవధికప్రీతిప్రేరితుఁడనై యాడునట్లును పాడునట్లును వేంచేసి సేవసాదింప కృపఁజేయుము. నాకు లభింపని యంశ మిదియే గాన దీనిని ప్రసాదింప ప్రార్థించుచున్నాను. ... ... ౮

ఇడకిలేనొన్ఱట్టకిల్లేన్ ఐమ్బులన్ వెల్లకిల్లేన్ *
కడవనాకిక్కాలన్దోఱుమ్ పూప్పఱిత్తేత్తకిల్లేన్ *
మడవన్నెఞ్జమ్ కాదల్ కూర వల్వినైయేనయర్ప్పాయ్ *
తడవుకిన్ఱే నెజ్ఞుకాణ్బాన్ శక్కరత్తణ్ణలేయే. ౯

(ఆకలియు దాహమును గలవారలకు)

ఒన్ఱిడకిలేన్ ఒన్ఱట్టకిల్లేన్ ఐమ్బులన్ వెల్లకిల్లేన్ కడవనాకి కాలన్దోఱుమ్ పూపఱిత్తు ఏత్తకిల్లేన్; మడమ్ వల్ నెఞ్జమ్ కాతల్ కూర వల్వినైయేన్ అయర్ప్పాయ్ శక్కరమ్ అణ్ణలై తడవుకిన్ఱేన్ ఎఙ్గు కాణ్బన్.

ఒక కబళాన్నము పెట్టుట ఒకనోటి తీర్థమిచ్చుట చేయలేనివాఁడనైతిని. ఐదింద్రియములను నియమించుటకు సమర్థుఁడను కాకపోతిని. (భక్తి యోగమునందు) నియతుఁడనై (ఆరాధనమున కనుకూలమైన) ప్రతికాలమందును పుష్పములను సంపాదించి స్తుతించుటకు అసమర్థుఁడనైతిని. (ఇట్లకించనుఁడై యుండగా) (ఆశ్రయించిన విషయములయందు) అవగాహించి బలిష్ఠమైన మనస్సు అభినివేశము వృద్ధినొందగా బలిష్ఠములగు పాపములుకల నేను మతివిభ్రమము నొందినవాఁడనై

చక్రాయుధముగల స్వామిని వెతుకుచున్నాను;
ఎచ్చట చూచెదను ?

తా. ఆర్తులనుజూచి వారియందుఁ దయకలవాఁడనై యుపకరించినచో నది భగవంతునికిఁ బ్రీతికరమని తలఁచి అట్లేమియు నుపకరింపనివాఁడ నైతిని. శాస్త్రవశ్యుఁడనై ప్రాప్తకాలములయందు పుష్పాదులచే భగవత్పాదారవింద ముల నారాధింపనివాఁడ నైతిని. చక్షురాదీంద్రియములను నితరవిషయముల యందుఁ బ్రావణ్యము లేకుండునట్లు నియమించుట కశక్తుఁడనైతిని. ఇట్లు కర్మ యోగ జ్ఞానయోగములు మొదలగు నుపాయముల ననుష్ఠింపనివాఁడనై క్రూర పాపములుచేసిన నేను భగవద్విషయమునం దభినివేశము మితిమించి సర్వస్వామిని సాక్షాత్కరించుటకై యంతట వెతుకుచున్నాను. నే నెట్లు సాక్షాత్కరించెదను ?

శక్కరత్తణ్ణలేయెన్రు తాழ்న్దుకణ్ ణీర్ తదుమ్బ *
పక్కమ్నోక్కినిన్రలన్దే పావియేన్ కాణ్గిన్రిలేన్ *
మిక్కఞానమూర్త్తియాయ వేదవిళక్కినై * ఎన్
తక్కఞానక్కణ్గళాలే కణ్డుతழுవువనే. ౧౦

శక్కరమ్ అణ్ణలే ఎన్రు తాழ்న్దు కణ్ నీర్ తతుమ్బ పక్కమ్ నోక్కి నిన్రు అలన్దే పావియేన్ కాణ్గిన్రిలేన్; మిక్కఞానమూర్త్తి యాయ వేతమ్ విళక్కినై ఎన్ తక్కఞానమ్ కణ్గళాలే కణ్డు తழுవువన్.

చక్రాయుధమును ధరించిన (సౌందర్య మునుజూపి) నన్ను దాసునిగాఁ జేసుకొనిన ఓ స్వామీ! అని భూమిమీఁదపడి నేత్రములయందు నీరు నిండియుండునట్లు ప్రక్కలయందు చూచి నిలిచి దుఃఖించినవాఁడ నైతిని; పాపిష్ఠుఁడనైన నేను సాక్షాత్కరించుటకు భాగ్యవంతుఁడు కాక పోతిని. అపరిచ్ఛిన్న జ్ఞానస్వరూపుఁడై వేదములని యెడి దీపముచేఁ జూడఁదగినవానిని నాకుఁ దగు మైన జ్ఞానమనియెడి నేత్రములచే సేవించి సంశ్లే షించెదను.

తా. చక్రాయుధమును ధరించుటచేఁ దన నిరవధిక సౌందర్యమును నాకుఁ గనుపఱచి నన్ను వశీకరించినవాఁడా! అని యనుసంధించుచు మోహించి భూమి మీఁదపడి నేత్రములయందు కన్నీరు వ్యాపింప నాల్గుప్రక్కలు చూచి యచ్చట కనుపడనందున మిక్కిలి. శోకించినవాఁడ నైతిని. నీ వాపత్సఖుఁడైనను నేను సాక్షాత్కరించుటకుఁ బ్రబల ప్రతిబంధకములు - నా యతి క్రూరములగు పాప ములే; ఇట్లు బాహ్యానుభవము కలుగకనున్నను నీ దివ్యరూపమును మఱచియుండి జీవించుటకు నశక్యమైయున్నది. నాకు తగుమైన యొక జ్ఞానదృష్టి కలిగినందున సదా మానసానుభవము జరుగుచున్నది. ఈ మానసానుభవహేతువైన జ్ఞానము నా కెందుకుఁబుట్టెనో? ... ... ... ౧౦

* తఴువినిన్ఱ కాదల్ తన్నాల్ తామరైక్కణ్ణనై *
కుఴువుమాడత్తెన్కురుకూర్ మాఱన్శడకోపన్ * శొల్
వఴువిలాదవొణ్ తమిఴ్కళ్ ఆయిరత్తుళిప్పత్తుమ్ *
తఴువప్పాడియాడవల్లార్ వైకున్దమేఱువరే. ౧౧

తఴువి నిన్ఱ కాతల్ తన్నాల్ తామరై కణ్ణనై కుఴువుమ్ మాడమ్ తెన్కురుకూర్ మాఱన్ శడకోపన్ వఴువిలాత ఒణ్ తమిఴ్కళ్ ఆయిరత్తుళ్ ఇప్పత్తుమ్ తఴువ పాడి ఆడవల్లార్ వైకున్దమ్ ఏఱువర్.

(భగవత్స్వరూపమును) సంశ్లేషించి స్థిరమైన భక్తిచే తామరపుష్పములవంటి నేత్రములు కలవాని నుద్దేశించి సమృద్ధములైన మంటపములుకల తిరునగరికి నిర్వాహకులై మాఱన్ అని యెడి కులనామముకల ఆళ్వార్లు సాదించినవియు భగవద్గుణములయం దొకటియు విడువక విలక్షణములును ద్రావిడరూపములును నైన వేయి పాశురములలో నీ పదిపాశురములను (ఆ తిరువాయ్మొఴియందుండు అభిప్రాయములతో మనస్సు) అమరునట్లు పాడి నర్తనముచేయుటకు శక్తులగువారు వైకుంఠమునందు వాసమును పొందుదురు.

తా. భగవత్స్వరూపముతో నవినాభూతముగ నవగాహించియున్న నిర వధికభక్తిచే నాళ్వార్లు భగవద్విషయముగ సాధించిన భగవద్గుణప్రతిపాదకము లగు వేయి పాశురములలో నీ పదిపాశురములను భావబంధముతో నభ్యసించు వారు శ్రియఃపతితో నిత్యసంశ్లేషమునకు ప్రాప్తమగు పరమపదమును బొంది యానందింతురు. ... ... ... ... ౧౧

చతుర్థశతకములో సప్తమదశకము ముగిసెను.
ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడిగళే శరణమ్.

---

తిరువాయ్ మొழி - చతుర్థశతకములో

## అష్టమదశకము — ఏఱాళుమ్

* ఏఱాళుమిఱైయోనుమ్ తిశైముకనుమ్తిరుమకళుమ్ *
కూఱాళుమ్తనియుడమ్బన్ కులఙ్గులమావశురర్కళై *
నీఱాకుమ్బడియాక నిరుమిత్తుప్పడైతొట్ట *
మాఱాళన్ కవరాద మణిమామైకుఱైవిలమే. ౧

ఏఱు ఆళుమ్ ఇఱై యోనుమ్ తిశై ముకనుమ్ తిరు మకళుమ్ కూఱు ఆళుమ్ తని ఉడమ్బన్ కులమ్కులమా అశు రర్కళై నీఱాకుమ్బడియాక నిరుమిత్తు పడై తొట్ట మాఱా ళన్ కవరాత మణి మామై కుఱై విలమ్.

వృషభమును వాహనముగాఁ గలవాఁడగు (తనను లోకముల కీశ్వరుఁడని యభిమానించియున్న) రుద్రుఁడును (దిక్కులవలె) నాల్గు ముఖములుకల బ్రహ్మయు శ్రీదేవియు భాగించుకొని అనుభవింపఁదగిన అద్వితీయమైన దేహము కలవాఁడును గుంపులుగుంపులుగా అసురులు భస్మమగునట్లు సంకల్పించి ఆయుధము ధరించిన వాఁడును నైన పురుషశ్రేష్ఠుఁడు ఆశపడని ప్రకాశముకల వర్ణముచే నొకకార్యమును లేదు.

తా. బ్రహ్మ రుద్రులును శ్రీదేవియు నియతముగ ననుభవింపఁదగిన దివ్య మంగళవిగ్రహము కలవాఁడును విరోధి నిరసనశీలుఁడును నైన భగవంతుఁ డాశ పడని శ్లాఘ్యమైన దేహకాంతిచే నాకేమియు కార్యములేదు. ... ౧

మణిమామైకుత్తైవిల్లా మలర్ మాదరుత్తై మార్బర్ *
అణిమానత్తడవరైత్తోళ్ అడలాళ్తడక్కైయర్ *
పణిమానమ్పిழైయామే అడియేనై ప్పణికొణ్డ *
మణిమాయర్కవరాద మడనెఞ్జాల్ కుత్తైవిలమే. ౨

మణి మామై కుత్తై విల్లా మలర్ మాతర్ ఉత్తై మార్పర్ అణి మానమ్ తడమ్ వరై తోళ్ అడల్ ఆழி తడమ్ కైయర్ పణి మానమ్ పిழైయామే అడి యేనై పణికొణ్డ మణి మాయర్ కవరాత మడమ్ నెఞ్జాల్ కుత్తైవిలమ్.

(మాణిక్యమువలె) యుజ్జ్వలమైన వర్ణము నకు కొఱఁతలేకనున్నదియు పుష్పమునందుఁ బుట్టిన భోగ్యతకలదియు ఉత్తమస్త్రీయు నైన శ్రీదేవి నిత్యవాసముచేయుచున్న వక్షస్థలము కల వాఁడును ఆభరణములచేఁ బ్రకాశించుచున్న వియు దీర్ఘములును సువృత్తములును (పర్వత ములవలె) దృఢములును నైన భుజములుకల వాఁడును విరోధినిరసనసమర్థమైన చక్రాయుధము కల గొప్ప హస్తముకలవాఁడును కైంకర్యముల యందు ఒకటియు తప్పక దాసుఁడనైన నన్ను దాస్యమునందుఁ గైకొనిన నీలరత్నమువలె నల్లని కాంతికలవాఁడును నైన భగవంతుఁడు ఆశపడని విధేయమైన మనస్సుచే కార్య మేదియులేదు.

తా. సుశీలుఁడైన శ్రియఃపతి తన సౌశీల్యమునకుఁ గారణభూతురాలైన శ్రీదేవితోఁగూడ వేంచేసి తన దివ్యసౌందర్యమును నాకుఁ గనుపఱచి నన్ను దాస్యమునందు గైకొనినవాఁ డంగీకరింపని నామనస్సుచే నాకెట్టి కార్య మును లేదు. ... ... ... ... ౨

మడనెఞ్జాల్కుత్తైవిల్లా మకళ్ తాయ్ శెయ్దొరుపేయ్చ్చి *
విడనఞ్జములై శువైత్త మికుఞానచ్చిఱుకుழవి *
పడనాకత్తణైక్కిడన్ద పరువరైత్తోళ్ పరమ్పురుడన్ *
నెడుమాయన్ కవరాద నిఱైవినాల్కుఱైవిలమే. 3

మడమ్ నెఞ్జాల్ కుఱై విల్లా తాయ్ మకళ్ శెయ్తు ఒరు పేయ్చ్చి విడనఞ్జమ్ ములై శువైత్త మికుఞానమ్ శిఱుకుழవి పడమ్ నాకత్తణై కిడన్ద పరు వరై తోళ్ పర మ్పురుడన్ నెడు మాయన్ కవరాత నిఱైవినాల్ కుఱై విలమ్.

(పుత్రునియందు) భవ్యమైన మనస్సుచేఁ గొఱఁతలేకనున్న యశోదవలె మనుష్యవేషమును ధరించిన అద్వితీయురాలగు పూతనయొక్క క్రూరమైన విషముకల స్తనమును పానముచేసిన మిక్కిలి రసజ్ఞానముకల చిన్నశిశువును పడగలు కల శేషశయనమునందు నిద్రించుచున్నవాఁడును గొప్ప పర్వతమువలె (పెరిగిన) భుజములుకల వాఁడును పరమపురుషుఁడును నిరవధికమైన ఆశ్చర్యకరములగు గుణచేష్టితములు కలవాఁడును నైన కృష్ణుఁడు అంగీకరింపని స్త్రీత్వ పూర్తిచే కార్యముకలవారము కాము.

తా. ఆశ్రితవిరోధి నిరసనసమర్థుఁడును నత్యంత విలక్షణుఁడును నైన శ్రియఃపతి యత్యభినివేశముతో నంగీకరింపని నా స్త్రీత్వముచే నాకేమియు ప్రయోజనములేదు. ... ... ... ... 3

నిఱైవినాల్కుఱైవిల్లా నెడుమ్పణైత్తోళ్ మడప్పిన్నై *
పొఱైయినాల్ములైయణైవాన్ పొరువిడైయేழడర్త్తుకన్ద *
కఱైయినార్తువరుడుక్కై కడైయావిన్ కழికోల్కై *
శఱైయినార్కవరాద తళిర్నిఱత్తాల్కుఱైవిలమే. ౪

నిఱైవినాల్ కుఱైవిల్లా

స్త్రీత్వపూర్తిచేఁ గొఱఁతలేనిదియు దీర్ఘములును పొందికగల భుజములుకలదియు భవ్య

నెడు పణై తోళ్ మడమ్ పిన్నై ములై అణై వాన్ పొఱై యినాల్ పొరు విడై ఏళు అడర్త్తు ఉకన్ద కరై యిన్ ఆర్ తువర్ ఉడుక్కై కడై యా క్కోల్ కై శిరై యినార్ కవరాత తళిర్ నిఱత్తాల్ కుఱైవిలమ్.

రాలును నైన నప్పిన్నపిరాట్టి స్తనములను ఆలింగనము చేసికొనుటకై బలముచే యుద్ధోన్ముఖములైన వృషభములు ఏడింటిని సంహరించి సంతసించినవాఁడును కఱలు నిండి చాయయెక్కిన వస్త్రమగు కృష్ణాజినమును దుష్టపశువులను (నియమించుటకై) ముల్లుకఱ్ఱను చేతియందు ధరించి (మొలయందుఁగట్టిన) గజ్జెలుకల కృష్ణుఁడు అంగీకరింపని చిగుళులవలె (నెఱ్ఱని) కాంతిచే మాకెట్టి ప్రయోజనము లేదు.

తా. ఆత్మగుణములచేతను రూపగుణములచేతను పూర్ణరాలును నతి మనోహరములగు దివ్యభుజములుకల నప్పిన్నపిరాట్టియందు వ్యామోహముకలవాఁడై విరోధులగు యేడు గొప్పవృషభములను సంహరించి తన యిష్టము నెఱవేరినందున సంతసించి, ఇట్లొకస్త్రీని నభిమానించిన కృష్ణుఁ డాశపడని నామనోహర కాంతిచే నేమి కార్యముకలదు ? ... ... ... ౪

తళిర్ నిఱత్తాల్ కుఱైవిల్లా త్తనిచ్చిఱైయిల్ విళప్పుణ్డు *
కిళి మొళ్ళియాళ్ కారణమా క్కిళరరక్కన్నకరెరిత్త *
కళిమలర్త్తుళాయలజ్గల్ కమళ్ ముడియన్ కడల్ ఞాలత్తు *
అళిమిక్కాన్ కవరాద అఱివినాల్ కుఱైవిలమే. ౫

తళిర్ నిఱత్తాల్ కుఱై విల్లా తని శిఱైయిల్ విళప్పుణ్డు కిళి మొళియాళ్ కారణమా కిళర్ అరక్కన్ నకర్ ఎరిత్త కళిమలర్

చిగురువలె మనోహరమైన వర్ణమువలన కొఱఁతలేనిదియు సహాయములేకయే చెఱయుండునదియు సర్వలోకప్రసిద్ధురాలును చిలుకవలె మధురములగు వార్తలుకలదియు నైన సీత నిమిత్తముగ గర్వోష్ఠుఁడగు రాక్షసుఁడైన రావణునియొక్క సమృద్ధమైన నగరమగు లంకను

తుழாయలజ్గల్ కమழ్ ము డియర్ణ కడల్ ఞాలత్తు అళి మిక్కా్ణ కవరాత అఱివి నాల్ కుఱై విలమ్.

భస్మీకరించినవాఁడును తేనె స్రవించుచు వికసించిన తులసిమాలికలచేఁ బరిమళించుచున్న కిరీటముకలవాఁడును సముద్రముచేఁ జుట్టబడిన భూమియందు కృపచే నధికుఁడును నైన భగవంతుఁడు అంగీకరింపని జ్ఞానముచే నేమికార్యమును లేదు.

తా. సుకుమారమైన శరీరముకలదియు మధురముగ మాటలాడునదియు నైన శ్రీదేవియగు సీతను రావణాసురుఁడు చెఱయం దుంచినందున వాని నగరమైన లంకను భస్మమగునట్లు దహించిన కృపాపరవశుఁ డంగీకరింపని నాజ్ఞానముచే నాకేమియు ప్రయోజనము లేదు. ... ... ౫

అఱివినాల్ కుఱైవిల్లా అకల్ ఞాలత్తవరఱియ *
నెఱియెల్లామెడుత్తురైత్త నిఱైఞానత్తొరుమూర్తి *
కుఱియమాణురువాకి క్కొడుఙ్గోళాల్ నిలఙ్గొణ్డ *
కిఱియమ్మాన్ కవరాద కిళరొళియాల్ కుఱైవిలమే. ౬

అఱివినాల్ కుఱైవిల్లా అకల్ ఞాలత్తవర్ అఱియ నెఱియెల్లామ్ ఎడుత్తు ఉరైత్త నిఱైఞానమ్ ఒరుమూర్తి కుఱియ మాణురువాకి క్కొడు క్కోళాల్ నిలమ్ కొణ్డ కిఱి అమ్మాన్ కవరాత కిళర్ ఒళియాల్ కుఱైవిలమ్.

జ్ఞానమునం దపేక్ష లేనందున కొఱఁతలేక యున్న విస్తీర్ణమైన భూమియందుండు జనులు ఎఱుఁగునట్లు సకలోపాయములను ప్రకాశమగునట్లు సాదించిన పరిపూర్ణజ్ఞానవంతుఁడును అద్వితీయమైన స్వభావముకలవాఁడును పొట్టియగు బ్రహ్మచారివేషము కలవాఁడును నై వంచన చేయుటచే భూమిని స్వాధీనపఱచుకొనిన ఉపాయములనెఱింగిన సర్వేశ్వరుఁడు అంగీకరింపని వృద్ధియగుచున్న కాంతిచే ఏమి ప్రయోజనము కలదు?

తా. విస్తారమైన భూలోకమునందున్న చేతనులు చక్కఁగాఁ దెలుసుకొను నట్లు కర్మయోగము మొదలు ప్రపత్తి పర్యంతముగ సకలోపాయములను సంశయ విపర్యములు లేనట్లు సాదించియు పరిపూర్ణ జ్ఞానస్వరూపుఁడైన తాను తన గొప్ప శరీరమును బొట్టిగాఁ జేసికొని వామనుఁడై యవతరించి మహాబలి యపహరించిన త్రైలోక్యమును గొల్చి స్వాధీనపఱచుకొనియు ఇట్లు చేతనులకు సంప్రాప్త్యుపా యమును ఉపదేశించియు జ్ఞానయోగ్యత లేనివారలకు సౌందర్యమును గనుపఱచి వశీకరించుకొనిన కృష్ణుఁ డంగీకరింపని లావణ్యముచే నాకేమి ప్రయోజనము కలదు? ... ... ... ... ౬

కిళరొళియాల్ కుఱై ఇల్లా అరియురువాయ్ క్కిళర్ న్దెళున్దు *
కిళరొళియవిరణియనదు అకల్ మార్పమ్ కిళిత్తుకన్ద *
వళరొళియకనలాళి వలమ్బురియన్ణ మణినీల *
వళరొళియాన్ కవరాద వరివళై యాల్ కుఱై విలమే. ౭

మణి నీలమ్ వళర్ ఒళియాన్ కిళర్ ఒళియాల్ కుఱైవిల్లా అరియురువాయ్ కిళర్న్దు ఎళున్దు కిళర్ ఒళియ ఇరణియనతు అకల్ మార్పమ్ కిళిత్తు ఉకన్ద వళర్ ఒళియ కనల్ ఆళి వలమ్బురియన్ కవరాత వరి వళైయాల్ కుఱైవిలమ్.

మాణిక్యమువలె (శ్లాఘ్యమై) నీలరత్నము వలె ప్రకాశించుచున్న అసాధారణమగు శరీర కాంతికలవాడును అభివృద్ధమైన కాంతిచే కొఱఁత లేని సింహరూపము కలవాఁడగుచు (శత్రునిరస నమునందు) ఉద్యోగించి (స్తంభముననుండి) ఆవిర్భవించి మిక్కిలి యధికమైన తేజస్సుకలవాఁ డగు హిరణ్యునియొక్క విస్తీర్ణమైన వక్షస్థలమును జీల్చి సంతసించినవాఁడును వృద్ధియగుచున్న జ్వాలలుకల అగ్నివలెనున్న చక్రాయుధమును శంఖమును కలవాఁడును నైన సర్వేశ్వరుఁడు ఆదరింపని రేఖలుకల వలయములచే నేమి ప్రయో జనముకలదు?

తా. బాలుఁడగు ప్రహ్లాదునికి విరోధియై తానే జగదీశుఁడని తలఁచి గర్వించియున్న హిరణ్యుని నృసింహావతారం బెత్తి సంహరించిన నిరతిశయ తేజోమయ దివ్యమంగళవిగ్రహముకల సర్వేశ్వరుఁడు, ఇట్లు బాధపడుచున్న నాకు సేవసాదించి రక్షింపనియెడల నేను ధరించియున్న ఆభరణములచే నా కేమి ప్రయోజనముకలదు ? ... ... ... ... ౭

వరివళై యాల్ కుఱై విల్లా ప్పెరుముழக్కాలడఙ్గారై *
ఎరియழలమ్పుక వూది ఇరునిలము న్తుయర్ తవిర్ త్త *
తెరివరియశివన్ పిరమన్ అమరర్ కోన్ పణిన్దేత్తుమ్ *
విరిపుగழాన్ కవరాద మేకలైయాల్ కుఱై విలమే. ౮

వరి వళై యాల్ కుఱై విల్లాప్పెరుముழక్కాల్ అడఙ్గారై ఎరి అழలమ్ పుక ఊతి మన్ ఇరునిలమ్ తుయర్ తవిర్ త్త తెరివరియ శివన్ పిరమన్ అమరర్ కోన్ పణిన్దు ఏత్తుమ్ విరి పుకழాన్ కవరాత మేకలైయాల్ కుఱై విలమ్.

(ముఖమునందు) రేఖలుకల శ్రీపాంచజన్యముచే పరిపూర్ణమైన గొప్పధ్వనివలన అణగని శత్రువులమీద జ్వలించుచున్న (భయమనియెడి) అగ్ని ప్రవేశించునట్లు తగలపెట్టి మునుపు విశాలమగు భూమియొక్క దుఃఖమును బోఁగొట్టినవాఁడును వివేకింప నశక్యుఁడగు రుద్రుఁడు బ్రహ్మ దేవతలకు నిర్వాహకుఁడగు ఇంద్రుఁడు (వీరు) నమస్కరించి స్తుతించునట్లు విస్తీర్ణమైన యశస్సుకలవాఁడును నైన భగవంతుఁడు ఆదరింపని మంచివస్త్రమువలన ఏమి ప్రయోజనము కలదు ?

తా. ముఖమునందు మనోహరములగు రేఖలుకల శ్రీపాంచజన్యమును గంభీరముగ ధ్వనింపఁజేసి గర్విష్ఠులగు శత్రువులను భయపఱచి భారతయుద్ధమునందు సకల కౌరవసేనలను నాశపఱచి భూభారమునుదీర్చి యుపకరించిన పరమోపకారకుఁడు తన కసాధారణభూతురాలగు నన్ను ఉపేక్షించినయెడల నేను ధరించియున్న మంచివస్త్రముచే నా కేమి ప్రయోజనముకలదు ? ... ౮

మేకలై యాల్ కుఱై విల్లా మెలివుఱ్ఱకలల్ కుల్ *
పోకమకళ్ పుకఴ్ తన్దై విఱల్వాణ‌ర్ పుయమ్ తుణిత్తు *
నాగమిశై త్తుయిల్వాన్పోల్ ఉలకెల్లామ్ నన్గొడుజ్గ *
యోగశైవార్ కవరాద ఉడమ్బినాల్ కుఱై విలమే. ౯

మేకలై యాల్ కుఱైవు ఇల్లా మెలివు ఉఱ్ఱ అకల్ అల్ కుల్ పోకమ్ మకళ్ తన్దై పుకఴ్ విఱల్ వాణ‌ర్ పుయమ్ తుణిత్తు నాకమిశై తుయిల్వాన్పోల్ ఉలకెల్లామ్ నన్గు ఒడుజ్గ యోశు అణై వార్ కవరాత ఉడమ్బినాల్ కుఱై విలమ్.

వస్త్రముచేత కొఱఁతలేక మార్దవము కల విస్తీర్ణములైన పిరుదులుకలదియు భోగ యోగ్యమగు స్త్రీత్వము కలదియు నగు (ఉషకు) తండ్రియనిమెడి ప్రసిద్ధికలవాఁడును గొప్ప పరాక్రమవంతుఁడును నైన బాణాసురునియొక్క భుజములను ఛేదించి శేషశయనమునందు నిద్రించువానివలె సర్వలోకములును (సంప్రాప్తి యనిమెడి) శుభమునందు వర్తించునట్లు ఉపాయమును ఆలోచించువాఁడు ఆదరింపని శరీరముచే ఏమి ప్రయోజనముకలదు?

తా. ఆశ్రితవిరోధియగు బాణాసురుని నిరసించి సకలచేతనులు నుజ్జీవించుటకు నుపాయమును ఆలోచించు భగవంతుఁడు ఆదరింపని నాశరీరముచే నాకేమి ప్రయోజనముకలదు? ... ... ... ౯

ఉడమ్బినాల్ కుఱై విల్లా ఉయిర్ పిరిన్దమలై త్తుణ్డమ్ *
కిడన్దనపోల్ తుణిపలవా అశురర్ కుఴామ్ తుణిత్తుకన్ద *
తడమ్బునలశడై ముడియన్ తనియొరుకూఱమర్న్దుఱైయుమ్ *
ఉడమ్బుడైయాన్ కవరాద ఉయిరినాల్ కుఱై విలమే, ౧౦

ఉడమ్బినాల్ కుఱై
విల్లా అశురర్ కుఴామ్ ఉ
యిర్ పిరిన్ద మలై త్తుణ్డమ్ కిడ
న్దనపోల్ పలతుణిశ తుణి
త్తు ఉకన్ద తడమ్బునల శడై
ముడియన్ తని అమర్ న్దు
ఒరుకూఱు ఉఱైయుమ్ ఉడ
మ్బు ఉడైయాన్ కవరాత
ఉయిరినాల్ కుఱైవిలమ్.

శరీరములచేఁ బూర్ణులగు అసురసమూహ
ములను (ఇంద్రునిచే ఛేదింపఁబడి) మరణము
జెందిన పర్వతఖండములు పడియున్నట్లు పలువిధ
ములుగ ఖండములగునట్లు ఛేదించి సంతసించిన
వాఁడును విస్తీర్ణ జలముకల (గంగను ధరించు
చున్న) జటతోఁగూడిన శిరస్సుకల రుద్రుఁడు
ప్రత్యేకముగ నమరి ఒకపార్శ్వమునందు నిత్య
వాసముచేయఁదగిన శరీరము కలవాఁడును నగు
భగవంతుఁడు ఆదరింపని ఆత్మచే నాకెట్టి ప్రయో
జనమును లేదు.

తా. ఇంద్రునిచే ఱెక్కలు ఛేదింపఁబడిన పర్వతములవలె గొప్పశరీరము కల అసురులను ఖండించి పడఁగొట్టిన విరోధి నిరసనముచే సంతసించినవాఁడును రుద్రుఁ డమరి వసించుచున్న దివ్యమంగళవిగ్రహము కలవాఁడును నైన భగవంతుఁ డాదరింపని నాయాత్మచే నాకెట్టి ప్రయోజనమును లేదు. ... ౧౦

ఉయిరినాల్ కుఱైవిల్లా ఉలకేఴ్ తన్నుళ్ ఒడుక్కి *
తయిర్ వెణ్ణెయుణ్డానై త్తడఙ్గురుకూర్ చ్చడకోపన్ *
శెయిరిల్ శొల్లిశై మాలై ఆయిరత్తుళిప్పత్తాల్ *
వయిరఞ్జేర్ పిఱప్పఱుత్తు వైకున్దమ్ నణ్ణువరే. ౧౧

ఉయిరినాల్ కుఱై ఇల్లా
ఏఴులకు తన్నుళ్ ఒడుక్కి
తయిర్ వెణ్ణెయ్ ఉణ్డానై
తడమ్ కురుకూర్ శడకోపన్
శెయిర్ ఇల్ శొల్ ఇశై
మాలై ఆయిరత్తుళ్ ఇప్ప

జీవాత్మలచేఁ బూర్ణములైన సమస్తలోక
ములను తనయందుఁ జేర్చి పెరుగును వెన్నను
భుజించినవాని నుద్దేశించి విస్తీర్ణమైన తిరునగరికి
నిర్వాహకులైన ఆఴ్వార్లు సాధించిన శబ్దార్థము
లందు దోషములు లేని శబ్దరూపములును గాన
ముతోఁగూడిన సందర్భములును నైన వేయి

త్తాల్ వయిరమ్ శేర్ పిఱప్పు అఱుత్తు వైకున్దమ్ నణ్ణువర్.

పాశురములలో నీ పదిపాశురములచే చావ యెక్కిన (అనాదియైన) సంసారబంధమును బోగొట్టుకొని పరమపదమును పొందుదురు.

తా. ప్రళయకాలమునందు సకలలోకములను దన యుదరమునందుంచి రక్షించిన పరమోపకారకుని విషయముగ నాళ్వార్లు సాదించిన సర్వలక్షణసంపన్నములగు వేయిపాశురములలో నీ పదిపాశురములను సాభిప్రాయముగ నభ్యసించువారు అనాదిసిద్ధమైన సంసారసంబంధమును బోగొట్టుకొని పరమపదమును బొందుదురు. ... ... ... ... ౧౧

చతుర్థశతకములో అష్టమదశకము ముగిసెను.

ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.

---

తిరువాయ్ మొళి - చతుర్థశతకములో

## నవమదశకము — నణ్ణాదార్

* నణ్ణాదార్ ముఱువలిప్ప నల్లుఱ్ఱార్ కరైన్దేఙ్గ *
ఎణ్ణారాత్తుయర్విళైక్కుమ్ ఇవై యెన్న వులగియఱ్కై *
కణ్ణాళా కడల్ కడైన్దాయ్ ఉనకళ్ఱ్కే వరుమ్పరిశు *
తణ్ణావాదడియేనై ప్పణికణ్డాయ్ శామాఱే. ౧

నణ్ణాతార్ ముఱువలిప్ప నల్ ఉఱ్ఱార్ కరైన్దు ఏఙ్గ ఎణ్ ఆరా తుయర్ విళైక్కుమ్ ఇవై ఉలకి యఱ్కై ఎన్న! కణ్ణాళా కడల్

భగవంతుని నాశ్రయింపని (శత్రువులు) నవ్వునట్లును మంచిస్నేహముకల బంధువులు కరిగి ఎక్కెక్కి దుఃఖచునట్లును సంఖ్యకు అణగని దుఃఖములను బుట్టించుకొనియెడి ఈ లోకస్వభావము ఏ మాశ్చర్యకరముగనున్నది! కృపావం

కడైన్దాయ్ ఉన కழలక్కే వరుమ్పరిశు తణ్ణావాదు అడియేనై శామాఱు పణి కణ్డాయ్.

తుఁడై క్షీరసముద్రమును చిలికినవాఁడా! నీ యొక్క పాదపద్మములకే (నేను శేషముగ) వచ్చు ప్రకారమును ఆలస్యముచేయక దాసుఁడ నైన నన్ను గుఱించి శరీరవిశ్లేషము కలుగునట్లు సాధింపవలెను.

తా. పరులయొక్క అనర్థములనుజూచి యానందించియు నిరుపాధిక బంధువగు భగవంతు నుపేక్షించి యాభాసబంధువులను నిరుపాధికబంధువులని తలఁచి వారికి నాపదనుజూచి దుఃఖించియు ఇట్లు అసంఖ్యాకంబులుగు పాపములను తామే తెచ్చుకొనుచున్న యీ సాంసారికులలోనుండి నివృత్తుఁడనై కృపావంతుఁడవును మహోపకారకుఁడవును నైన నీయొక్క దివ్యపాదారవిందంబులను నాశ్రయించునట్లు దాసునికి శరీరవిశ్లేషమును గృపఁజేయవలెను. ... ౧

శామాఱుఙ్కెడుమాఱుమ్ తమరుఱ్ఱార్ తలైత్తలైప్పెయ్తు *
ఏమాఱ్ఱక్కిడన్దలఱ్ఱుమ్ ఇవై యెన్న వులకియఱ్కై *
ఆమాఱొన్ఱఱియేన్ నాన్ అరవణై యాయమ్మానే *
కూమాఱేవిరైకణ్డాయ్ అడియేనైక్కుఱిక్కొణ్డే. ౨

శామాఱుమ్ కెడుమాఱుమ్ తమర్ ఉఱ్ఱార్ తలైత్తలైప్పెయ్తు ఏమాఱ్ఱి కిడన్దు అలఱ్ఱుమ్ ఇవై ఎన్న ఉలకియఱ్కై! నాన్ ఆమ్ ఆఱు ఒన్ఱు అఱియేన్; అరవణైయాయ్ అమ్మానే అడియేనై కుఱిక్కొణ్డు కూమాఱు విరైకణ్డాయ్.

చచ్చుప్రకారమును (ఐశ్వర్యము) నశించు ప్రకారమును జ్ఞాతులును బంధువులును పైబడి పైబడి దుఃఖితులై (భూమిమీఁద) పడియుండి మొఱలిడుటయు ఇవి ఏమి లోకులయొక్క స్వభావములో! నేను ఇది ముగించురీతిని అల్పమును ఎఱుఁగను. అనంతశయనుఁడా! స్వామీ! శేషభూతుఁడనైన నన్ను (దుఃఖమును సహింపని వాఁడని) తలఁచి (నన్ను) పిలిపించుకొనుటకు యత్నింపుము.

తా. అస్థిరములైన యైశ్వర్యములను స్థిరముగ నమ్మి ధైర్యముగ నున్నప్పుఁడవి నశించుటయు ఆభాసబంధువులను నిరుపాధిక సర్వవిధ బంధువులని తలఁచి వారి దుఃఖమునందుఁ దాము దుఃఖించుటయు ఇట్లు జీవింపవలయునని యపేక్షించువారు నశించుటయు నివి యొక జీవితమగునా! ఈ ఘోరమైన సంసారమునందు వర్తించుచున్న నాయందది యేమైముగించునో నే నెఱుఁగను. దాసభూతుల యందుఁ దాస్యమును గైకొనుచున్న ఓ సర్వస్వామీ! దుఃఖమును సహింపఁజాలని నా స్వభావము నెఱిఁగి శీఘ్రముగ పిలుపించుకొనుటకుఁ గృపఁ జేయుము.

కొణ్డాట్టుమ్కులమ్పునైవుమ్ తమరుళ్ళార్ విళ్ళునిదియుమ్ *
వణ్డార్ పూఙ్కుழలాళుమ్ మనైయొழிయవుయిర్మాయ్దల్ *
కణ్డాన్ఱేనులకియఱ్ఱై కడల్వణ్ణావడియేనై *
పణ్డేపోల్ కరుదాదు ఉన్నడిక్కేకూయ్ప్పణికొళ్ళే. 3

కొణ్డాట్టుమ్ కులమ్ పునైవుమ్ తమర్ ఉళ్ళార్ విళ్ళు నితియుమ్ వణ్డు ఆర్ పూ కుழలాళుమ్ మనై ఒழிయ ఉయిర్ మాయ్ తల్ ఉలకియఱ్ఱై కణ్డు ఆన్ఱే కడల్ వణ్ణా అడియేనై పణ్డే పోల్ కరుతాతు ఉన్ అడిక్కే కూయ్ పణికొళ్.

శ్లాఘించుటయు లేనికులము నారోపించుకొనుటయు జ్ఞాతులును సంబంధులును శ్రేష్ఠమైన ధననిధియును తుమ్మెదలచేఁ బూర్ణములైన పుష్పములుకల శిరస్సుతోఁగూడిన స్త్రీలును గృహములును (ఇవి) ఉండగా ప్రాణములు నశించుట (అనియెడి) లోకస్వభావమును జూచి భరింపలేను. సముద్రమువలె (అపరిచ్ఛిన్నమగు) సౌందర్యముకలవాఁడా! దాసుఁడనైన నన్ను మునుపటివానివలె స్వీకరింపక నీయొక్క శ్రీపాదములకే తగునట్లు పిలిచి దాస్యమును గైకొనుము.

తా. నిత్యసంసారులు తనను శ్లాఘించుకొనుటయు తమకులేని యాభిజాత్యము నారోపించుకొనుటయు తమ యైశ్వర్యములనుజూచి యాశపడి వచ్చిన జ్ఞాతులును బంధువులును ఐశ్వర్యమును సుందరస్త్రీలును గృహములును ఇవియుండగాఁ బ్రాణవినాశము నొందునట్టి ఈ లోకస్వభావమునుజూచి నేను సహింపఁజాలను.

ఓ సర్వస్వామీ! నీ యపరిచ్ఛిన్న దివ్యసౌందర్యమునం దవగాహించి దాసుఁడనైన నాయొక్క దుఃఖమును మునుపటి విశ్లేషదుఃఖమని తలఁపక నీ దివ్యపాదారవిందములకే శేషమగునట్లు నన్ను స్వీకరింపవలెను. ... ... ౩

కొళ్ళెన్ఱుకిళర్ న్దెழுన్ద పెరుఞ్జెల్వమ్ నెరుప్పాగ *
కొళ్ళెన్ఱుతమమూడుమ్ ఇవైయెన్నవులగియఱ్కై *
వళ్ళలేమణివణ్ణా ఉనకழలక్కే వరుమ్పరిశు *
వళ్ళల్ శెయ్ దడియేనై ఉనదరుళాల్వాఙ్గాయే. ౪

కొళ్ ఎన్ఱు కిళర్ న్దు ఎழுన్ద పెరుమ్ శెల్వమ్ నెరుప్పాగ కొళ్ ఎన్ఱు తమమ్ మూడుమ్ ఇవై ఎన్న ఉలకి యఱ్కై! వళ్ళలే మణి వణ్ణా ఉన కழలక్కే వరుమ్పరిశు వళ్ళల్ శెయ్ తు అడియేనై ఉనతు అరుళాల్ వాఙ్గాయ్.

(నన్ను) స్వీకరింపుము అని అభివృద్ధినొంది కనబడుచున్న గొప్ప ఐశ్వర్యము అగ్నివలె (అనర్థహేతు వగుచుండగా) (దీనిని) స్వీకరింపుము అని (అజ్ఞానమనియెడి) అంధకారము ఆవరించుకొనునట్టి ఇవి ఏమి లోకస్వభావములో! పరమోదారుఁడును నీలరత్నమువలె (మనోహరమైన) విగ్రహముకలవాఁడును నైన (ఓ శ్రియఃపతి!) నీయొక్క పాదములయందు ఆశ్రయించునట్లు ఔదార్యమును జేసి దాసభూతుఁడనైన నన్ను నీ కృపచే స్వీకరింపుము.

తా. చేతనులు తా మాశతో స్వీకరించుచున్న యైశ్వర్యము తమ కనర్థములను బుట్టించుచుండగా మఱల ఆయైశ్వర్యమునే ప్రార్థించుచున్నారు. ఇట్టి యజ్ఞానాంధకారముచే వ్యాప్తమైన నీ లోకయాత్రనుజూచి సహింపఁజాలను గాన ఓ శ్రియఃపతీ! నిరవధికసుందరములైన నీ దివ్యపాదారవిందములను నే నాశ్రయించునట్లు దాసునియందుఁ గృపనుంచి స్వీకరింపుము. ... ౪

వాఙ్గునీర్ మలరులగిల్ నిఱ్పనవుమ్తిరివనవుమ్ *
ఆఙ్గుయిర్ కళ్ పిఱప్పిఱప్పు ప్పిణిమూప్పాల్ తకర్ ప్పుణ్ణుమ్ *

ఈణ్డియన్మేల్ వెన్నరకమ్ ఇవై యెన్న వులకియత్తై *
వాణ్గనై నీమణివణ్ణా అడియేనై మఱుక్కేలే. ౫

వాఙ్గుమ్ నీర్ మలరుల కిల్ నిఱ్పనవుమ్ తిరివనవుమ్ ఆఙ్గు ఉయిర్కళ్ ఈఙ్గు పిఱప్పిఱప్పుప్పిణిమూప్పాల్ తకర్ప్పుణ్ణుమ్ ఇతన్మేల్ వెమ్ నరకమ్ ఇవై ఎన్న ఉలకియత్తై! మణి వణ్ణా నీ ఎన్నై వాఙ్గు; అడియేనై మఱుక్కేల్.

(తనలోపలికి) ఈడ్చుకొనుచున్న సముద్ర జలముకల విస్తీర్ణమగు భూమియందు నిలుచునట్టి (స్థావరములును) సంచరించునట్టి (జంగమపదార్థములును) ఆశరీరములయందున్న ప్రాణముల కాశ్రయములగు (జీవాత్మలును) ఇచ్చట జనన మరణ వ్యాధి జరలచే బాధపడుచుండును. దీనికిఁ బైన క్రూరమైన నరకమును (అనుభవించును) ఇవి ఏమి లోకస్వభావములో! నీలరత్నమువలె దర్శనీయమైన విగ్రహముకలవాఁడా! నీవు దాసభూతుఁడగు నన్ను అంగీకరింపుము. దాసుని దుఃఖింపఁ జేయవలదు.

తా. చతుస్సాగరమధ్యమునందున్న పృథివీమండలమునందు స్థావరజంగమములగు సకలపదార్థములును జన్మజరామరణవ్యాధులచే దుఃఖించుచుండి ప్రాణవియోగానంతరము రౌరవము మొదలగు నరకముల ననుభవింతురు. ఇట్లు దుఃఖించునట్టి లోకస్వభావమును నేను సహింపఁజాలను. ఓ సర్వసులభుఁడా! ఈదుఃఖము సహింపఁజాలని నన్ను దుఃఖింపఁజేయక నంగీకరింప కృపఁజేయుము. ౫

మఱుక్కివల్వలై ప్పడుత్తి క్కుమైత్తిట్టుక్కొన్ఱుణ్బర్ *
అఱప్పొరుళై యఱిన్దోరార్ ఇవై యెన్న వులకియత్తై *
వెఱిత్తుళవముడియానే వినైయేనై ఉనక్కడిమై
అఱక్కొణ్డాయ్ * ఇవియెన్నారముదే కూయరుళాయే. ౬

భయపఱిచి బలిష్ఠమైన వలయందు జిక్కు

మఱుక్కి వల్ వలై క్కొనునట్లు చేసి హింసించి చంపి భుజింతురు;

పడు_త్తి కమై_త్తిట్టు కొన్ఱు ఉణ్బర్ అఱమ్ పొరుళై అఱిన్దు ఓరార్ ఇవై ఎన్న ఉలకియర్కై వెఱి తుళవమ్ ముడియానే విన యేనై ఉన క్కు అడి అడిమైకొణ్డాయ్ ఏఱ ఆర్ అముతే ఇని కూ యరుళాయ్.

ధర్మమనియెడి పురుషార్థమును తెలిసికొని (ధర్మ త_త్త్వమును) విచారింపరు. ఇవి ఏమి లోకస్వభావములో! పరిమళించుచున్న తులసిమాలికలను ధరించిన కిరీటముకలవాఁడా! పాపిష్ఠుఁడనైన నన్ను నీకు (అనన్యార్హుఁడ నగునట్లు) నిర్హేతుకముగ దాసునిగాఁ జేసికొనినవాఁడా! నాకు పరిపూర్ణమైన అమృతమువలె భోగ్యభూతుఁడా! ఇకమీఁద (ఇట్లార్తి జనించినపిదప) (పరమపదమునకు) పిలుపించుకొనుటకుఁ గృపఁజేయుము.

తా. ఈలోకమునందుండు చేతనులు పరద్రవ్యముల నపహరించుటకై ఇతరులను వంచించి ద్రవ్యములను స్వాధీనపఱచుకొని వారిని హింసించియు నిట్లు జీవింతురు గాన ప్రథమపురుషార్థమగు ధర్మమును పురుషార్థమని తెలిసికొని యాధర్మత_త్త్వమును వివేకింపకనున్నారు. ఇది యేమి లోకస్వభావమో? ఇట్లు పరహింసయం దాసక్తులగు నీ సంసారిచేతనుల మధ్యమునందుండి యీదుఃఖమును నేను సహింపలేను గాన నీ దివ్యపాదారవిందంబులయం దాశ్రయించునట్లు నన్ను స్వీకరింపఁ గృపఁజేయుము. ... ... ... ౬

ఆయేయివ్వులకత్తు నిఱ్పనవుమ్తిరివనవుమ్ *
నీయేమఱ్ఱొరుపొరుళుమిన్ఱి నీనిన్ఱమైయాల్ *
నోయేమూప్పిఱప్పిఱప్పు ప్పిణియేయెన్ఱివై యొழியే *
కూయేకొళ్ళడియేనై క్కొడువులకమ్కాట్టేలే. ౭

ఇ ఉలకత్తు నిఱ్పనవుమ్ తిరివనవుమ్ నీయే ఆయ్ మఱ్ఱు ఒరుపొరుళుమ్ ఇన్ఱి నీ నిన్ఱమైయాల్ నోయే

ఈ లోకమునందు స్థావరములును జంగమపదార్థములును నీవే (అనునట్లు సకలవస్తువులకును) ప్రకారివైై ఇతరమైన ఒక పదార్థమును లేక నీవు ఉన్నందున మనోవ్యాధి వార్ధకము

మూప్పే పిఱప్పే, ఇఱప్పే పిణి యే ఎన్ఱు ఇవై ఒఴియ అడి యేనై కూవేకొళ్ కొడు ఉలగమ్ కాట్టేల్.

జన్మము మరణము శరీరవ్యాధి యని చెప్పఁబడు చున్న ఇవి నశించునట్లు దాసభూతుఁడగు నన్ను పిలిపించుకొనుము. క్రూరమగుజగత్తును చూపింప వలదు.

తా. స్థావరజంగమములగు సకలపదార్థములును తనకుఁ బ్రకారము లగు నట్లు తాను ప్రకారియై సకలపదార్థములకును నంతరాత్మయైయున్న నీవు శరీరము నకువచ్చిన సుఖదుఃఖముల నాత్మ యనుభవించునట్లు నీకు శరీరభూతుఁడనైన నాకున్న సుఖదుఃఖములను నీ వనుభవింపఁదగిన నాసంబంధ మున్నందున జన్మ నిబంధనములగు దుఃఖములను బోఁగొట్టుకొనుటకై వ్యసనమును బోఁగొట్టి నీవే నన్ను పిలుపించుకొనుటకు కృపఁజేయవలెను. ... ... ౭

కాట్టినీకరన్దుమిழుమ్ నిలనీర్ తీవిశుమ్బుకాల్ *
ఈట్టినీవై త్తమైత్త ఇమైయోర్ వాழ్ తనిముట్టై *
కొట్టైయినిల్ కழిత్తు ఎన్నై ఉన్ కొழுజ్జోతియుయగత్తు *
కూట్టరియతిరువడిక్కళ్ ఎజ్ఞాన్ఱుకూట్టుదియే. ౮

కాట్టి నీ కరన్దు ఉమిழుమ్ నిలమ్ నీర్ తీవిశుమ్బు కాల్ ఈట్టి వైత్తు ఇమైయోర్ వాழ் అమైత్త తని ముట్టై కోట్టైయినిల్ కழிత్తు ఎన్నై ఉన్ కొழுజ్జోతి ఉయరత్తు కూడు అరియ తిరువడి

(మునుపటి సృష్టియందు) ప్రకాశపఱచి నిరపేక్షకారణభూతుఁడవగు నీవే (స్వరూపము నందు) దాచి (సృష్టికాలమునందు) క్రక్కి భూమి జలము అగ్ని ఆకాశము వాయువులగు (పంచ భూతములను) చేర్చి (ఆవరణముగ) ఉంచి దేవత లకు వాసస్థానమగునట్లు సృష్టించిన అద్వితీయ మైన అండమనియెడి కోటను బోఁగొట్టి నన్ను నీకు నసాధారణమును నిరవధిక తేజోరూపమును

కళ్ ఎణ్ణాన్ద కూట్టుతి. నై మేలైన (పరమపదమునందు) పొందుటకు నసాధ్యమైన శ్రీపాదములను ఏకాలమందు ఆశ్రయింపఁజేయుదువు.

తా. ప్రళయకాలమునం దుదరమునందుంచి సకల జగత్తులను రక్షించియు సృష్టికాలమునందు సృష్టించియు నిట్లు సకల జగత్కారణభూతుఁడవగు నీవు పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనియెడి పంచభూతములను కార్యానుకూలముగఁ జేర్చి బ్రహ్మాది దేవతలకు వాసస్థాన మగునట్లు సృష్టించిన యండమనియెడి కోటలో నుండి నన్ను బయటతీసి సంసారగంధము లేనిదియు నిరవధిక తేజోమయమునునైన పరమపదమును బొంది నీ దివ్యపాదారవిందముల నాశ్రయించునట్లు నన్నెన్నడు చేసెదవో? ఆకాలమును నాకుఁ దెలిపింపుము. ... ౮

కూట్టుదినిన్ కురై కழల్ కళ్ ఇమైయోరుమ్ తొழావకై శెయ్ దు *
ఆట్టుదినీయరవణై యాయ్ అడియేనుమ్ అఱిదు అఱివన్ *
వేట్కై యెల్లామ్ విడుత్తు ఎన్నై యున్ తిరువడియే శుమన్దుழల *
కూట్టరియతిరువడిక్కళ్ కూట్టినై నాన్ కణ్డేనే. ౯

నీ కురై నిన్ కழల్ కళ్ కూట్టుతి; ఇమైయోరుమ్ తొழావకై శెయ్ తు ఆట్టుతి; అరవు అణైయాయ్ అతు అడియేనుమ్ అఱివన్; వేట్కై ఎల్లామ్ విడుత్తు ఎన్నై ఉన్ తిరు అడి శుమన్దు ఉழల కూట్ట అరియ తిరువడిక్కళ్ కూట్టినై నాన్ కణ్డేన్ ఏ.

నీవు భోగ్యములైన నీ శ్రీపాదములలో జేర్చుకొందువు; దేవతలును అనుభవింపనట్లు చేసి దుఃఖింపఁజేయుదువు; ఆదిశేషుని శయనముగాఁ గలవాఁడా! ఆస్వభావమును శేషభూతుఁడగు నేనును తెలిసికొనినవాఁడను; ఆశలు అన్నింటిని బోఁగొట్టి నన్ను నిరతిశయభోగ్యములైన నీ శ్రీపాదములను శిరసావహించి అనుసరించునట్లు (తామే) ఆశ్రయించుటకు అశక్యములైన శ్రీపాదములయందుఁ జేర్చుకొంటివి. నేను సాక్షాత్కరించితిని. ఇది సత్యము.

తా. అకించనులైనను నీవు విశ్వసించినవారిని నీ దివ్యపాదారవిందముల యందుఁ జేర్చుకొనుటకుఁ దగిన శక్తుఁడవు; ఎట్టి జ్ఞానవంతులైనను స్వయత్నపరులను దుఃఖింపఁజేయుదువు. ఇట్టి సర్వశక్తుఁడవైన నీయొక్క దివ్యస్వభావమును జ్ఞానములేనివాఁడనైన నే నెఱింగితిని. సంసారగంధమును సవాసనముగఁ బోఁగొట్టి దాసునికి నీ దివ్యపాదారవిందములయం దభినివేశమును బుట్టించి యాశ్రయించునట్లు చేసి నన్నంగీకరించినవాఁడ వైతివి. దీనిని నే ననుభవించి చెప్పుచున్నాను. ... ... ... ... ౯

కణ్డు కేట్టుఱ్ ఱుమో న్దుణ్డుఝలుమ్ ఐజ్గరువి
కణ్డవిన్బమ్ * తెరివరియ అళవిల్లాచ్చిఱ్ ఱిన్బమ్ *
ఒణ్డొడియాళ్ తిరుమకళుమ్ నీయుమేనిలానిఱ్ప *
కణ్డశదిర్ కణ్డొఴిన్దేన్ అడైన్దేను న్తిరువడియే. ౧౦

కణ్డు కేట్టు ఉఱ్ఱు మోన్దు ఉణ్డు ఉఝలుమ్ ఐజ్గరువి కణ్డ ఇన్బమ్ తెరివు అరియ అళవిల్లా శిఱు ఇన్బమ్ ఒణ్ తొడియాళ్ తిరు మకళుమ్ నీయుమే నిలా నిఱ్ప కణ్డ శతిర్ కణ్డు ఒఴిన్దేన్ ఉన్ తిరువడి అడైన్దేన్.

(రూపమును) జూచియు (శబ్దమును) వినియు (శీతాదులను) స్పర్శించియు (గంధమును) ఆఘ్రాణించియు (రసమును) భుజించియు ఇట్లు తిరుగుచున్న ఐదింద్రియములచే ననుభవించిన సుఖమును తెలిసికొనుటకు నశక్యమును అపరిచ్ఛిన్నమును (భగవదనుభవమునకంటె) అల్పమును నైన కైవల్యసుఖమును విలక్షణములగు హస్తవలయములు గలదియు తిరు అని చెప్పఁబడునదియు ఉత్తమస్త్రీయు నైన శ్రీదేవియు నీవును (మీరిద్దరే) ప్రకాశించి ఉండునట్లు చూచి యున్న (నీ) చాతుర్యమును సాక్షాత్కరించి (ఐశ్వర్యకైవల్యములను) త్యజించితిని. (పరమపురుషార్థభూతుఁడవైన) నీయొక్క శ్రీపాదములను ఆశ్రయించినవాఁడనైతిని.

తా. చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణత్వక్ అనియెడి ఐదింద్రియములచే నా యింద్రియ విషయములగు రూపశబ్దరసగంధస్పర్శములను పరిచ్ఛేదించి యనుభవింపఁబడిన యైహికసుఖమును, ఆ యైదింద్రియములకసాధ్యమును నైహికసుఖమునకంటె శ్రేష్ఠమును భగవదనుభవరూపమగు పరమానందమునకంటె నల్పమును నైన కైవల్యమును సవాసనముగ త్యజించి ప్రాప్తుఁడవైన నీ దివ్యపాదారవిందములను నే నాశ్రయించినవాఁడనైతిని. ... ... ౧౦

* తిరువడియైనారణనై క్కేశవనై ప్పరఞ్జుడరై *
తిరువడి శేర్వదుకరుది చ్చెழுఙ్గురుకూర్ చ్చడకోపన్ *
తిరువడిమేలురై త్తతమిழ் ఆయిరత్తుళిప్పత్తుమ్ *
తిరువడియేయడై విక్కుమ్ తిరువడి శేర్ న్దొన్ఱుమినే. ౧౧

తిరువడియై నారణనై కేశవనై పరఞ్జుడరై తిరువడి శేర్వతు కరుతి శెழுమ్ కురుకూర్ శడకోపన్ తిరువడి మేల్ ఉరైత్త తమిழ் ఆయిరత్తుళ్ ఇప్పత్తుమ్ తిరువడియే అడై విక్కుమ్ తిరువడి శేర్ న్దు ఒన్ఱుమిన్,

సర్వస్వామియు అంతరాత్మయు కేశియనియెడి రక్కసుని సంహరించినవాఁడును పరంజ్యోతిస్స్వరూపుఁడును నైన కృష్ణ నుద్దేశించి వాని పాదముల నాశ్రయించుటకు నిచ్ఛగించి మనోహరమైన కురుకూరికి నిర్వాహకులైన ఆழ்వార్లు వానిపాదముల విషయముగ సాదించిన ద్రావిడరూపములగు వేయి పాశురములలో నీ పదిపాశురములు ఆ శ్రీపాదములనే ఆశ్రయింపఁజేయును. ఆ శ్రీపాదముల నాశ్రయించి (నిత్యకైంకర్యములయందు) అన్వయింపుఁడు.

తా. ఇతరవిషయములయందు రుచిని బోఁగొట్టి తనయందుఁ బ్రావణ్యమును బుట్టించిన సర్వస్వామియు సకలవస్తువుల కంతర్యామిగనుండువాఁడును నాశ్రితవిరోధి నిరసనశీలుఁడును నైన కృష్ణు నుద్దేశించి యాழ்వార్లు సాదించిన వేయిపాశురములలో నీ పదిపాశురములు తమను నాదరముతో నభ్యసించువాని

నాకృష్ణునియొక్క దివ్యపాదారవిందములను బ్రాపించును గాన మీరాశ్రయించి నిత్యకైంకర్యములయం దన్వయింపుఁడు. ... ... ౧౧

చతుర్థశతకములో నవమదశకము ముగిసెను.

ఆళ్వార్ ఎమ్బెరుమానార్ జీయర్ తిరువడికళే శరణమ్.

---

తిరువాయ్ మొழி - చతుర్థశతకములో

## దశమదశకము — ఒన్ఱుమ్ తేవుమ్

* ఒన్ఱుమ్ తేవుములకుముయిరుమ్మత్ ఱుమ్ యాదుమిల్లా
అన్ఱు * నాన్ముకన్ తన్నొడు తేవరులకోడుయిర్ పడైత్తాన్ *
కున్ఱమ్ పోల్ మణిమాడనీడు తిరుక్కురుకూరదనుళ్ *
నిన్ఱ వాదిప్పిరాన్ నిఱ్క మత్తైత్తెయ్ వమ్నాడుది రే. ౧

ఒన్ఱుమ్ తేవుమ్ ఉలకుమ్ ఉయిరుమ్ మత్ ఱుమ్ యాతుమ్ ఇల్లావన్ఱు నాన్ముకన్ తన్నొడు తేవర్ ఉలకు ఉయిర్ పడైత్తాన్ కున్ఱమ్ పోల్ మణి మాడమ్ నీడు తిరుక్కురుకూరతనుళ్ నిన్ఱ ఆతి పిరాన్ నిఱ్క మత్తై తెయ్ వమ్ నాడుతి రే.

(ప్రళయకాలమున తనయందు) చేరుచున్న దేవతలును వారి లోకములును (మనుష్యులు మొదలగు) ప్రాణులును తక్కిన మహదాదిపదార్థములును సమస్తవస్తువులును లేనికాలమందు బ్రహ్మతోఁగూడ దేవతలను లోకములను ప్రాణులను సృష్టించినవాఁడును పర్వతములవలె (ఉన్నతములైన) మాణిక్యమయములైన మేడలు ఉన్నతములైయున్న తిరునగరియందు వేంచేసియున్నవాఁడును కారణభూతుఁడును నైన మహోపకారకుఁడు వేంచేసియుండగా తక్కిన దేవతలను ఆశ్రయించుటకుఁ దిరుగుచున్నారే.

తా. ఓ చేతనులారా! సకల జగత్కారణభూతుఁడగు సర్వేశ్వరుఁ డీ దివ్యతిరునగరియందు సర్వసమాశ్రయణీయుఁడై వేంచేసియుండఁగా మీరు ఇతర దేవతల నాశ్రయించుట కుద్యోగించుచున్నారే మీ కిది యేమి యజ్ఞానమో? ౧

నాడినీర్ వణజ్గు దైయ్ వముమ్ ఉమ్మైయుమున్పడైత్తాన్ *
వీడిల్ శీర్ప్పుకழ்త్తాదిప్పిరాన్ అవన్మేవియుఱై కోయిల్ *
మాడమాళిగై శూழ్న్దழகాయ తిరుక్కురుకూరదనై *
పాడియాడిప్పరవిచ్చెన్మిన్గళ్ పల్లులకీర్ పరన్దే. ౨

సీర్ నాడి వణజ్గుమ్ తెయ్ వముమ్ ఉమ్మైయుమ్ మున్ పడైత్తాన్ వీడిల్ శీర్ పుకழ் ఆతిప్పిరానవన్ మేవి ఉఱై కోయిల్ మాడమ్ మాళిగై శూழ்న్దు అழகాయ తిరుక్కురుకూరతనై పల్ ఉలకీర్ పాడి ఆడి పరవి పరన్దు శెన్మిన్గళ్.

మీరు నిరూపించి ఆశ్రయించు దేవతలను ఆశ్రయించుచున్న మిమ్ములను మునుపు (సృష్టికాలమునందు) సృష్టించినవాఁడును నాశము లేని కల్యాణగుణములు కలవాఁడును మాహాత్మ్యము కలవాఁడును నైన ప్రథమోపకారకుఁడు అమరి వేంచేసియున్న స్థానమును మేడలును గృహములును వ్యాపించి మనోహరమైన తిరునగరిని (గుణములచేతను రుచిభేదములచేతను) పలువిధములు కల లోకములయందున్న మీరు పాడియు ఆడియు బహువిధములుగ స్తుతించియు అంతట వ్యాపింపుడు.

తా ఓ చేతనులారా! మీచే నాశ్రయింపఁబడు దేవతలను ఆశ్రయించువారైన మిమ్మును సృష్టికాలమునందు సృష్టించి రక్షించుటచే సంతసించువాఁడును సమస్తకల్యాణగుణములు కలవాఁడును నైన భగవంతుఁడు వేంచేసియున్న దివ్యతిరునగరియందు ప్రేమపరవశులై యాడుచును పాడుచును పలువిధములుగ స్తుతించుచును వర్తింపుడు. ... ... ... ౨

పరన్ద తెయ్ వముమ్ పల్లులకుమ్బడైత్తు అన్తుడనే విళుజ్గి *
కరన్దుటుళ్ళ్ న్దుకడన్దిడన్దదుకణ్డుమ్ తెళియకిల్లీర్ *
శిరజ్గళాలమరర్ వణజ్గుమ్ తిరుక్కురుకూరదనుళ్ *
పరన్తిఱమన్ఱిప్పల్లులకీర్ తెయ్వమ్ మత్తిల్లై పేశుమినే. 3

పరన్ద తెయ్వముమ్ పల్లులకుమ్ పడైత్తు అన్తు ఉడనే విళుజ్గి కరన్దు ఉమిళ్న్దు కడన్దు ఇడన్దతు కణ్డుమ్ తెళియ కిల్లీర్ అమరర్ శిరజ్గళాల్ వణజ్గుమ్ తిరుక్కురుకూరతనుళ్ పరన్ తిఱమన్ఱి మత్తు తెయ్వమ్ ఇల్లై పల్ ఉలకీర్ పేశుమినే.

అనేకులైన దేవతలను పలువిధములగు లోకములను సృష్టించి ప్రళయకాలమునందు (క్రమము లేక) సమకాలమందే మ్రింగియు దాచి పెట్టియు (సృష్టికాలమునందు). బయలుపఱచియు (త్రివిక్రమావతారంబెత్తి) గొల్చియు (అవాంతర ప్రళయమునందు) భూమిని పైకెత్తియు (వీటిని) తెలిసికొనియు నిశ్చయించుటకు అసమర్థు లగు చున్నారు. దేవతలు శిరస్సులచే నమస్కరించు నట్టి తిరునగరిలో వేంచేసియున్న పరునికిఁ బ్రకారములు కాని ఇతరములగు (స్వాతంత్రములగు) దేవతలు లేవు. పలువిధములైన ఓ లోకులారా! (ఉన్న యెడల) చెప్పుడు.

తా. అనేకులగు దేవతలను ఆదేవతల కాశ్రయములగు లోకములను సృష్టించెననియు ప్రళయకాలమునందుఁ గ్రమము లేకయే మ్రింగి తన యుదరమునందుఁ దాచిపెట్టెననియు సృష్టికాలమునందు సృష్టించి రక్షించెననియు త్రివిక్రమావతారంబెత్తి సకలలోకములను తన పాదారవిందములచేఁ గొల్చి స్వాధీన పఱచుకొనెననియు అవాంతరప్రళయమునందు మునిగిపోయిన భూమిని వరాహావతారంబెత్తి పైకెత్తెననియు ప్రమాణములచేఁ దెలిసికొనియు మీరు నిశ్చయించుకొనుట కసమర్థు లగుచున్నారు. బ్రహ్మాది దేవతలును కొనియాడునట్లు శ్లాఘ్యమైన దివ్యతిరునగరిలో సర్వసులభుఁడై వేంచేసియున్న సర్వస్వామిత్వపరునికి పరతంత్ర

ములుకాని దేవతలులేరు. స్వతంత్రులగువా రెవరైన నున్నయెడల నాయెదుట వారిని బ్రమాణములచే సాధింపనిందు. ... ... 3

పేశనిన్ఱ శివనుక్కుమ్పిరమన్ఱనక్కుమ్ పిఱర్క్కుమ్
నాయకనవనే * కపాలనన్మోక్కత్తుక్కణ్డుకొణ్మిన్ *
తేశమామదిళ్ శూழ்న్దழుకాయ తిరుక్కురుకూరతనుళ్ *
ఈశనాబలోరవమ్పఱైదల్ ఎన్నావదిలిఙ్గియర్క్కే. ౪

పేశనిన్ఱ శివనుక్కుమ్ పిరమన్ఱనక్కుమ్పిఱర్క్కుమ్ నాయకన్ అవనే; కపాలమ్ నల్ మోక్కత్తు కణ్డు కొణ్మిన్; తేశమ్ మా మతిళ్ శూழ்న్దు అழుకాయ తిరుక్కురుకూరతనుళ్ ఈశన్బాల్ ఓర్ అవమ్ పఱైతల్ ఇలిఙ్గియర్క్కు ఎన్నావతు.

(మీరు సర్వేశ్వరుఁడని) వ్యవహరించునట్లున్న రుద్రునికిని బ్రహ్మకును తక్కినవారికిని నీశ్వరుఁడు (ప్రమాణ ప్రసిద్ధుఁడగు) ఆ శ్రియఃపతియే (అనువిషయమును) ఆరుద్రుఁడు ధరించిన కపాలముయొక్క మంచి మోతుమునందు చూడుఁడు; తేజోమయములును ఉన్నతములును నైన ప్రాకారములచేఁ జుట్టఁబడి సుందరమైన తిరునగరియందు (వేంచేసియున్న) సర్వేశ్వరవిషయమున నొక యపరాధమును జేయుటవలన అనుమానమును బ్రమాణముగాఁ గలవారికి నేమిఫలము కలదు?

తా. వ్యోమశబ్దవాచ్యుఁడగు సర్వేశ్వరునికంటె నతిరిక్తమైన యొక తత్వమును జెప్పుటవలన పాశుపతులు వ్యోమాతీతులనియు, అనుమానమును ముఖ్యప్రమాణముగ నంగీకరించుటవలన నైయాయిక వైశేషికులు ఆనుమానికులనియు చెప్పఁబడుదురు. అట్టి యానుమానికులు అవయవములతోఁ గూడినవియన్నియు కార్యములు గాన నీజగత్తును నవయవములతోఁ గూడియుండుటవలన కార్యమని చెప్పఁబడుననియు, అట్టి కార్యమున కొకకర్త యుండవలయు. విచిత్రసన్నివేశములతోఁ గూడియుండుటవలన దీనికి నుపాదానకారణము, సహకారికారణము,

ప్రయోజనము వినియోగపఱచువాఁడు నివి యావశ్యకములై యుండవలెననియు, వాటి నెఱుఁగుట యల్పజ్ఞునికి నశక్యమగుటవలన నాకర్త సర్వజ్ఞుఁడై యుండవలెననియు నిట్లనుమాన ప్రమాణముచే నొకకర్తను వానికి సర్వజ్ఞత్వమును సాధించి వేదవాక్యములను నాప్తవచనము లగుటవలన ఆ యనుమానప్రమాణమునకు సహకారములని జెప్పి అనుమానప్రాధాన్యముచే నితరునకు నీశ్వరత్వమును సాధించిరి. ఆ జగత్కర్తయైన సర్వజ్ఞుఁడు వేదమునందుఁ జెప్పఁబడు ఈశ ఈశానశబ్దవాచ్యుఁడని సమాఖ్యచే భగవదితరున కొకనికి సర్వేశ్వరత్వమును పాశుపతులు సాధించిరి. అనుమానమును ముఖ్యప్రమాణముగ నంగీకరించిన నైయాయిక వైశేషికులను గుఱించి వేదమునకు విరుద్ధమైన యనుమానము ప్రమాణము కానేరదు. మీరు చెప్పెడి యనుమానము వేదవిరుద్ధము. అది యెట్లన్న ? వేదమునకాదియందును అంతమందు నోంకార ముచ్చరింపఁబడుచున్నందునను ప్రథమమందోంకారమునుండి ప్రకాశించిన వేదము మఱల ఆ ప్రణవమందే లయించుచున్నందునను వేదమునకు నోంకారము ప్రకృతియగును. అట్టి ప్రణవము తనకుఁ బ్రకృతియగు అకారమునందు లయించుచున్నది. ఆ ప్రకృతియగు అకారమునకు వాచ్యుఁడగు విష్ణువే మహేశ్వరుఁడను శ్రుతివాక్యములచే ప్రతిపాద్యుఁడగు నారాయణుఁడే పరుఁడగుటవలన ఈ యర్థమునకు విరుద్ధమైన యనుమానము అప్రమాణమని శ్రుతిచే నానుమానికులను, అనుమానసిద్ధుఁడగు జగత్కర్త "ఈశః ఈశానః" అని వేదములయందుఁ బ్రసిద్ధముగఁ జెప్పఁబడుచున్నందున నాశబ్దములచేఁ జెప్పఁబడువాఁడే సర్వేశ్వరుఁడని సమాఖ్యచే భగవదితరునకు సర్వేశ్వరత్వమును సాధించుచున్న వ్యోమాతీతులనుగుఱించి భగవదితరులగు బ్రహ్మరుద్రులలో రుద్రుఁడు తన తండ్రియగు బ్రహ్మయొక్క తలను గిల్లినందున పాతకముకలవాఁడై యా బ్రహ్మకపాలము తనచేతియందంటుకొని భిక్షాటనము చేయుచు దుఃఖించుచున్న రుద్రునికిని తనశిరస్సు పోయి దుఃఖించుచున్న బ్రహ్మకును దుఃఖనివర్తకుఁడైనందున నారాయణుఁడే సర్వేశ్వరుఁడని జెప్పి లింగముచే సమాఖ్యను బోఁగొట్టి వ్యోమాతీతుల నాక్షేపించి నారాయణునికిఁ బరత్వమును స్థాపించిరి. ... ... ... ర

* ఇలిఙ్గ_త్తిట్టపురాణ_త్తీరుమ్ శమణరుమ్ శాక్కియరుమ్ *
వలిన్దువాదు శెయ్ వీర్ కళుమ్ మఱ్ఱునుమ్ _తెయ్ వముమాగినిన్ఱార్ *
మలిన్దు శెన్నెల్ కవరివీశుమ్ తిరుక్కురుకూరదనుళ్ *
పొలిన్దునిన్ఱ పిరాన్ కణ్డీర్ ఒన్ఱుమ్ పొయ్యిల్లై పోఱ్ఱుమినే. ౫

ఇలిఙ్గత్తు ఇట్ట పురాణ _త్తీరుమ్ శమణరుమ్ శాక్కియరుమ్ వలిన్దు వాదు శెయ్ వీర్ కళుమ్ మఱ్ఱుమ్ నుమ్ తెయ్ వమ:మ్ ఆకి నిన్ఱార్ శెన్నెల్ మలిన్దు కవరి వీశుమ్ తిరుక్కురుకూరతనుళ్ పొలిన్దు నిన్ఱ పిరాన్గణ్డీర్ ఒన్ఱుమ్ పొయ్ ఇల్లై పోఱ్ఱుమిన్.

లింగపూజను జెప్పెడి పురాణములయం దాదరముకల మీరును నగ్నులగు (జైనులును) బౌద్ధులును బలాత్కారముగ వాదించువారగు వైశేషికులును ఇతరములైన మీ కిష్టములగు దేవతలును శరీరములగునట్లు వేంచేసియున్న వారు పైరులు సమృద్ధములై చామరములవలె చలించుచున్న తిరునగరిలో (నైశ్వర్యము) ప్రసిద్ధమగునట్లు వేంచేసియున్న సర్వేశ్వరుఁడేకదా! (ఈయర్థమునందు) ఒకటియు అబద్ధము కానే రదు. (మీరు) స్తుతింపుడు.

తా. లింగపురాణము మొదలగు కుదృష్టిస్మృతులను బాహ్యస్మృతులను ప్రమాణముగ నంగీకరించి క్షుద్రదేవతలకుఁ బరత్వమును జెప్పెడి జైనులును బౌద్ధులును నితరులగు నైయాయికవైశేషికులు మొదలగువారును, వారాశ్రయించు క్షుద్రదేవతలును తనకు శరీరమగునట్లు తాను శరీరియైనవాఁడును నిరవధికసస్యములు మొదలగు చేతనములును కైంకర్యములను జేసి యుజ్జీవించునట్లు తిరునగరియందుఁ దన సౌలభ్యాదిగుణముల నావిష్కరించుచు వేంచేసియున్నవాఁడును నైన నారాయణుఁడే సర్వేశ్వరుఁడు. ఈవిషయము యథార్థము గాన ఓ చేతనులారా! మీరు బాహ్యకుదృష్టులయొక్క సహవాసమును వదలి యాసర్వేశ్వరుని స్తుతింపుడు. ... ... ... ౫

పోఱ్ఱిమఱ్ఱోర్ తెయ్ వమ్ పేణప్పుఱత్తిట్టు * ఉమ్మైయిన్నే
తేఱ్ఱివైత్తతు ఎల్లీరుమ్వీడుపెఱ్ఱాలులకిల్లైయెన్ఱే *

శేఱ్ఱిల్ శెన్నెల్ కమలమోఙ్గు తిరుక్కుఱుకూరదనుళ్. *
ఆఱ్ఱివల్ల వఙ్ మాయమ్ కణ్డీర్ అతఱిన్దఱిన్దోడుమినే. ౬

మఱ్ఱు ఓర్ తెయ్వమ్ పోఱ్ఱి పేణ ప్పుఱత్తిట్టు ఉమ్మై ఇన్నే తేఱ్ఱివైత్తదు ఎల్లీరుమ్ వీడు పెఱ్ఱాల్ ఉలకు ఇల్లై ఎన్ఱే; శేఱ్ఱిల్ శెన్నెల్ కమలమ్ ఓఙ్గు తిరుక్కుఱుకూరతనుళ్ ఆఱ్ఱివల్లవఙ్ మాయఙ్గణ్డీర్ అతు అఱిన్దు అఱిన్దు ఓడుమినే.

ఇతరమైన ఒక దేవతను స్తుతించి ఆదరించునట్లు ఆశ్రయింపఁజేసి మిమ్ములను ఇట్లు దేవతాంతరమునందు విశ్వాసమును బుట్టించినది అందఱును మోక్షమును బొందినచో శాస్త్రము (శాస్త్రమర్యాద) నశించునని తలఁచియే. బురదతోఁగూడిన క్షేత్రమునందు పయిరును కమలములును వృద్ధియగుచున్న తిరునగరియందు వేంచేసియున్న వాఁడును మిక్కిలి శక్తుఁడును నగు వానియొక్క మాయకదా? దానిని తెలిసికొని (నిస్తరణోపాయమును) తెలిసికొనినవారై ఆశ్రయింపుడు.

తా. నారాయణుఁడే సర్వేశ్వరుఁడైనచో నట్టివాఁడు మాకెందుకు దేవతాంతరములయందుఁ బ్రావణ్యమును బుట్టించెనన్న; మీకు దేవతాంతరములయందాదరమును బుట్టించి యా దేవతల నాశ్రయింపఁజేసిన దానికిఁ గారణము—సకల చేతనులును భగవత్సమాశ్రయణమనియెడి మోక్షమును బొందినచోఁ దన యాజ్ఞారూపములగు శాస్త్రములయొక్క మర్యాద చెడుననియెడి సంకల్పమే. ఇట్లుండ వానిహృదయము నెఱిఁగియు సంసారమునకుఁ గారణము వాని మాయయని తెలిసికొనియు వాటియందుఁ జిక్కుకొనక సంసారనిస్తరణోపాయమైన భగవంతు నాశ్రయించి యుజ్జీవింపుఁడు. ... ... ౬

ఓడి యోడిప్పలపిఱప్పుమ్ పిఱన్దు మఱ్ఱోర్ తెయ్వమ్
పాడియాడిప్పణిన్దు * పల్ పడికాల్ వழியేఱిక్కణ్డీర్ *

కూడివానవరేత్తనిన్ఱ తిరుక్కురుకూరదనుళ్ *
ఆడుపుళ్కొడియాదిమూర్త్తిక్కు అడిమైపుకువదువే. ౭

మర్ఱు ఓర్ తెయ్వమ్ పాడియాడి పణిన్దు పల్ పడికాల్ వழி ఏఱి ఓడిరోడి పలపిఱప్పుమ్పిఱన్దు కణ్డీర్; వానవర్ కూడి ఏత్త తిరుక్కురుకూరతనుళ్ నిన్ఱ ఆడుపుళ్ కొడి ఆతి మూర్త్తిక్కు అడిమైపుకువతు.

ఇతరమైన ఒక దేవతను పాడియు నాడియు నమస్కరించియు ననేక ప్రకారములుగ శాస్త్ర మార్గములచే నాశ్రయించి (దానిఫలమగు గర్భ నరకములయందు) పడి అనేకవిధ జన్మములనెత్తి (ఆఫలములను) చూచితిరి. (అయినందున) దేవతలు కూడి స్తుతించునట్లు తిరునగరియందు వేంచేసియున్నవాఁడును నర్తనముచేయుచున్న గరుత్మంతుని ధ్వజముగాఁ గలవాఁడును కారణభూతుఁడును నైన సర్వేశ్వరునికిఁ గైంకర్యములను జేయుఁడు.

తా. శ్రీశ్రీపేరితులై మీరితరదేవతలను బాడియునాడియు నమస్కరించియు ననేకప్రకారములచే శాస్త్రోక్తప్రకారముగ నాదేవతల నాశ్రయించి ఆ యాశ్రయణఫలములగు గర్భనరకములయందుఁ బడి దేవతిర్యఙ్మనుష్యస్థావరరూపములై యనేకవిధములగు ఘోరజన్మములనెత్తి, దుఃఖముల ననుభవించుచున్నారు గాన నికమీఁదనైన సర్వసులభుఁడై తిరునగరియందు వేంచేసియున్న గరుడధ్వజునకు సర్వవిధకైంకర్యములను జేసి యుజ్జీవింపఁజూడుడు. ... ౭

పుక్కడిమైయినాల్ తన్నై క్కణ్డ మార్క్కణ్డేయనవనై *
నక్కపిరానుమన్ఱుయ్యక్కొణ్డదు నారాయణనరుళే *
కొక్కలర్ తడన్తాழை వేలి త్తిరుక్కురుకూరదనుళ్ *
మిక్కవాదిప్పిరాన్నిఱ్క మర్ఱు ఎత్తెయ్వమ్ విళమ్బుతిరే. ౮

అడిమైయినాల్ పుక్కు

దాస్యములచే నాశ్రయించి (ఆశ్రయణీయుఁడైన) తనను సాక్షాత్కరించిన మార్క

తన్నై క్కణ్డ మార్కణ్డేయనై అవనై నక్కన్ పిరానుమ్ అన్ఱు ఉయ్యక్కొణ్డతు నారాయణన్ అరుళే; కొక్కు అలర్ తడమ్ తాళై వేలి తిరుక్కురుకూరతనుళ్ మిక్క ఆతి పిరాన్ నిఱ్క ఎమ్మనై ఱు తెయ్వమ్ విళమ్బుతిర్.

డేయుఁడని (పురాణప్రసిద్ధుఁడైన) వానిని దిగంబరుఁడు (ఆశ్రితులకు) ఉపకారకుఁడును నైన (రుద్రుఁడు) ఆ ప్రళయకాలమందు ఉజ్జీవింపఁజేసి నది నారాయణునియొక్క కృపయే; (అయినం దున) కొంగలవంటి కాంతికల పుష్పములు వికసించియున్న గొప్ప మొగిలిచెట్లను వేలిగాఁగల తిరునగరిలో సర్వాధికుఁడును సర్వకారణభూతుఁడును మహోపకారకుఁడును నైన భగవంతుఁడు వేంచేసియుండగా సాపేక్షములగు ఏయితరము లను దైవముగాఁ జెప్పుచున్నారు?

తా. మృకండుమహర్షి పుత్రుఁడైన మార్కండేయుఁడు తనను రుద్రునికిఁ దాసుఁడని యధ్యవసించి తన కాశ్రయణీయుఁడగు రుద్రుని సాక్షాత్కరించెను. ఆశ్రయించినవానిని దిగంబరుఁడగు రుద్రుఁ డాపత్కాలమునందు రక్షించిన దానికిఁ గారణము శ్రీమన్నారాయణునియొక్క నిర్హేతుకకృపయే. నిరవధికభోగ్యమైన తిరునగరియందు అట్టి సర్వజగత్కారణభూతుఁడు వేంచేసియుండగా నన్యాధీనసత్తకల రుద్రుఁడు మొదలగు నితరదేవతలలోనే దేవతలకుఁ బరత్వమును జెప్పుచున్నారు. ... ... ... ... ౮

విళమ్బుమాఱుశమయముమ్ అవైయాకియుమ్మఱ్ఱుమ్ తన్పాల్ *
అళన్దుకాణ్డఱ్కరియనాకియ ఆదిప్పిరానమరుమ్ *
వళఙ్గొళ్ తణ్ పణై శూழ్న్దழగాయ తిరుక్కురుకూరదనై *
ఉళఙ్గొళ్ ఞానత్తువైమ్మిన్ ఉమ్మైయుయ్యక్కొణ్డుపోకఱిలే. ౯

విళమ్బుమ్ ఆఱు శమయముమ్ మఱ్ఱుమ్ అవై యాకియుమ్ తన్పాల్ అళన్దు

శబ్దమాత్రమును (సారముగాఁగల) ఆఱు మతములును ఇతరములగు కుదృష్టులును ఒక టిగాఁ జేరను తనవిషయమునందు పరిచ్ఛేదించి

కాణ్డఱ్కు అరియనాకియ ఆతి పిరాన్ అమరుమ్ వళఙ్గొళ్ తణ్ పణై శూழ்న్దు అழகాయ తిరుక్కురుకూరతనై ఉమ్మై ఉయ్యక్కొణ్డు పోకు ఱిల్ ఉళ జ్గొళ్ ఘానత్తు వైమ్మినే.

సాక్షాత్కరించుటకు నశక్యమైన స్వభావముకల సర్వకారణభూతుఁడగు మహోపకారకుఁడు అమరి యుండు దర్శనీయములును శ్రమహారములును నైన తటాకములచే వ్యాప్తమై నిరతిశయభోగ్యమైన తిరునగరిని మిమ్ములను (మీరు) ఉజ్జీవింపఁ జేసికొని ఉండవలయునని తలఁచియున్నచో మీ మానసజ్ఞానమునందు ఉంచుఁడు.

తా. ప్రమాణవిరుద్ధములై కేవల శబ్దమాత్రమును సారముగాఁగల బౌద్ధ చార్వాక గౌతమ జైన సాంఖ్య పాశుపతులగు ఆఱుమతస్థులును వారితో సమానులైన కుదృష్టులు నందరు నేకీభవించి పరిచ్ఛేదింప యత్నించినను నపరిచ్ఛిన్న స్వభావుఁడగు తన విషయమునందు పరిచ్ఛేదించి సాక్షాత్కరించుటకు నశక్యుడగును గాన సర్వకారణభూతుఁడును మహోపకారకుఁడును నైన భగవంతుఁడు ప్రేమతో వేంచేసియున్న నిరతిశయభోగ్యమగు తిరునగరిని మీరు ధ్యానించుటయే ఉజ్జీవనోపాయమగును. ... ... ...

ఉఱువదావ తె త్తేవుమ్ ఎవ్వులకజ్గళుమ్ మఱ్ఱుమ్ తన్పాల్ *
మఱువిల్ మూర్తియోడొత్తు ఇత్తనైయుమ్ నిన్ఱవణ్ణమ్ నిఱ్కవే *
శెఱువిల్ శెన్నెల్ కరుమ్బొడోజ్గు తిరుక్కురుకూరదనుళ్ *
కుఱియమాణురువాకియ నీళ్ కుడక్కూత్తను క్కాళ్ చెయ్ వదే. ౧౦

ఎ త్తేవుమ్ ఎవ్వులకజ్గళుమ్ మఱ్ఱుమ్ ఇత్తనైయుమ్ తన్పాల్ మఱువిల్ మూర్తియోడొత్తు నిన్ఱవణ్ణమ్ నిఱ్కవే శెఱువిల్ శెన్నెల్ కరుమ్బొడు ఓజ్గు తిరుక్కురు

సకల దేవతలును సకల లోకములును తక్కిన (చిదచిద్వస్తువులును) ఇవియన్నియు తనయందు దోషము లేని అసాధారణవిగ్రహముతో సమానమై (తానుండు స్వరూపమునకు) భేదము లేక నుండగా పొలములయందు సస్యములు చెఱుకులతో సమానముగ వృద్ధియగునట్లు తిరునగరిలో

కూరతనుళ్ కుఱియ మాణురు వాకియ నీళ్ కుడకూత్త నుక్కు ఆళ్చ్చెయ్వతే ఉఱువతు ఆవతు.

వేంచేసియున్నవాడును పొట్టి బ్రహ్మచారి రూపము కలవాడును గొప్ప (మాహాత్మ్యము కల)వాడును నైన కుంభన ర్తనముచేసిన కృష్ణునికి కైంకర్యములు చేయుటయే సుకరమును ఉచితమును నైన (పురుషార్థము).

తా. సకల చేతనాచేతనములును తన దివ్యస్వరూపమునందు జేరి యసాధారణవిగ్రహముతో సమానముగనుండునట్లు తన యైశ్వర్యములయందొకటియు నశింపక సంపూర్ణసంపన్నుడైన సర్వేశ్వరుడు తిరునగరియందు సర్వసులభుడుగనే వేంచేసియున్నాడు. అట్టివానికి కైంకర్యములను జేయుటయే మన కుచితమును సుకరమును నైన పరమపురుషార్థము. ... ... ౧౦

* ఆళ్చ్చెయ్ దాళ్ పిప్పిరానై చ్చేర్ న్దవన్ వణ్ కురుకూర్ నకరాన్ *
నాట్కమళ్ మకిళ్ మాలై మార్పినన్ మాఱన్ శడకోపన్ *
వేట్కైయాల్ శొన్న పాడల్ ఆయిరత్తుళిప్పత్తుమ్ వల్లార్ *
మీట్చియిన్ఱి వైకున్దమానకర్ మఱ్ఱదు అఙ్కైయదువే. ౧౧

ఆళ్చ్చెయ్తు ఆళి పిరానై శేర్ న్దవన్ వణ్ కురుకూర్ నకరాన్ నాట్కమళ్ మకిళ్ మాలై మార్పినన్ మాఱన్ శడకోపన్ వేట్కైయాల్ శొన్న పాడల్ ఆయిరత్తుళ్ ఇప్పత్తుమ్ వల్లార్ క్కైయదు మఱ్ఱు అదు ...

(పరోపదేశరూపమగు) వాచికకైంకర్యము చేసి చక్రమును ధరించిన ఉపకారకుని ఆశ్రయించినవాడును విలక్షణమగు తిరునగరికి నిర్వాహకుడును ప్రతిదినము పరిమళించుచున్న పొగడపువ్వు మాలికలను వక్షస్థలమందు ధరించినవాడును "మాఱన్" అనియెడి తిరునామముకలవాడును నైన ఆళ్వార్లు అభినివేశముతో సాధించిన గానరూపములగు వేయి పాశురములలో ఈ పదిపాశురములను (అర్థానుసంధానముతో) అభ్యసించు